# క్వణత్కాంచి

## (వాగ్దేవిస్తవము)



మాధవపెద్ది చిన్న వేంకన్న M.A. B.O.L.
సంస్కృతోపన్యాసకుడు, ప్రగతి మహా విద్యాలయం
హనుమాన్ టేకిడి, కోఠి,
హైదరాబాద్.

అస్మద్గురుభ్యోనమః

# క్వణత్కాంచి

(శ్రీ వాగ్దేవీస్తవము)



రచన :

శ్రీదాస, గీరసజ్ఞ, సాహిత్య విశారద

మాధవపెద్ది చినవేంకన్న M.A., B.O.L.

ప్రథమ ముద్రణ - 1999

ప్రతులు : 1000



మూల్యము : **Rs. 20-00**

శ్రీ దయానంద్ గౌడ్ గారి ఆర్థిక సహాయంతో

మరియు

శ్రీ కర్షక్ ప్రింటర్స్ వారి సౌజన్యంతో ముద్రితము

ప్రాప్తిస్థానము :
మాధవపెద్ది చినవేంకన్న,
ఇ.నెం. 37-94/1, మధురానగర్, రోడ్ నెం. 1,
నేరేడ్‌మెట్ X రోడ్స్, హైదరాబాద్ - 500 056.
ఫోన్ : 7117617

మరియు

గోపాల్ పబ్లికేషన్స్
ఆర్యసమాజ్ మందిర్ ఎదురు సందులో,
కాచిగూడ చౌరస్తా, హైదరాబాదు - 500 027.
ఫోన్ : 4658101

## భూమిక

అస్మద్గురుభ్యోనమః

శ్రీ మాధవపెద్ది చిన వెంకన్నగారు వాగ్దేవీ స్తవనమునకు భూమికను లేదా ప్రస్తావనను వ్రాయమని నన్ను కోరుటకు మా బాల్యమైత్రి వారిని పురికొల్పి యుండవచ్చును. వీరికి 'గీరసజ్ఞ' అనునది ఉపాధి. 'శ్రీదాస' అనునది ఉపాహ్వా. ఈ రెంటికి అర్థమును తెలిసినచో ఈ స్తోత్రమును వ్రాయుటకు ఉద్దేశ్యము యోగ్యత అవగతమగును. 'గీరసజ్ఞులు' అనగా వాక్కుల రసమును తెలిసినవారు అని యోగార్థము. గణపతికి హయగ్రీవునకు సరస్వతికి గీరసజ్ఞ అనునది రూఢి. పద్మపురాణమున వ్యాసభగవానునకు కూడా ఈ బిరుదున్నట్లు తెలియుచున్నది.

గీరసజ్ఞ! మహావ్యాస! సర్వశాస్త్ర విశారద!
అజ్ఞానం వినివర్త్య త్వం విష్ణోః మార్గం ప్రదర్శయ!

అని వ్యాసభగవానుని ఋషులు ప్రార్థించినట్లు కనపడుచున్నది. కావున వాక్కుల రసమును తెలిసిన వారు గీరసజ్ఞులు అనునది సుస్పష్టము. వాక్కు అనగా రసము అనగా నేమియో కొంత విచారించుట అవస

రము. మన మనసులోనున్న అభిప్రాయమును తెలియ జేయుట కుపకరించునది వాక్కు. మనసులోని అహంకారమును తొలగించుట కుపకరించునది వాక్కు. తాత్కాలికముగా కాక భవిష్యత్తులో అనగా ముందు తరాల వారికి కూడా జ్ఞానజ్యోతిని ప్రసాదించునది వాక్కు. ఇహమును పరమును ప్రసాదించునది వాక్కే. ఒక మహాకవి వాగ్వైభవమును ఇట్లు చెప్పియున్నారు.

మాటల చేత దేవతలు మన్ననచేసి వరంబు లిత్తురున్
మాటల చేత భూపతులు మన్ననచేసి పురంబులిత్తురున్
మాటల చేత కామినులు మన్ననచేసి సుఖంబులిత్తురున్
మాటలు నేరకున్న అవమానము మానము మానభంగమున్.

కావున ఇహమున కావలసిన అన్ని సౌకర్యములు మనకు కలుగునది వాక్కు వలననే అనునది నిస్సంశయము. ఇక పరమున కావలసిన వాటిని అనగా అభ్యుదయమును నిశ్శ్రేయస మనగా మోక్షము, ఈ రెంటిని సాధించునది వాక్కే. స్వర్గమును సాధించుటకు కావలసిన యాగాదులను చేయుటకు సాధనము వాక్కే. ఆత్మనిగ్రహము కొరకు చేయు జపతపాదులకు కావలసినది కూడా వాక్కే. మోక్షమును ప్రసాదించు పరమాత్మ స్వరూపమును తెలియుటకు కావలసినది

కూడా వాక్కే. ఈ వాక్కు లేనిచో ఇంతకాలము ఇన్ని గ్రంథములు వెలువడుట, నిలుచుట జరుగని పని. కావున అన్నిటికి మూలము వాక్కే. అందుకే దండి మహాకవి కావ్యాదర్శమున ఇట్లు చెప్పియున్నాడు.

''ఇద మంధం తమః కృత్స్నం జాయేత భువనత్రయమ్!
యది శబ్దాహ్వయం జ్యోతి రాసంసారాన్న దీప్యతే'' అని.

అనగా సంసారమున శబ్దమను జ్యోతి వెలుగనిచో ఈ జగత్తంతయూ అంధకార బంధురమగును అని భావము. కావున వాక్కే ఈ జగత్తును ప్రకాశింప చేయునది. ఈ జగత్తును సృజించునది కూడా వాక్కే. చతుర్ముఖబ్రహ్మ వేదాధ్యయనము వలననే సృష్టి చేసెను. వేదమనగా వాక్కే కదా? విష్ణువు పరిపాలించు నది రుద్రుడు సంహరించునది వాక్కుతోనే. పరిపాలన విధానమును ఏర్పరచునది వేదశాస్త్రములే. అనగా వాక్కే. సంహారమునకు కాలము ఆసన్నము కావల యును. ప్రళయకాలమును నిర్దేశించునది కూడా వేదశాస్త్రములే. అనగా వాక్కే. కావున వాక్కే సర్వాధారము. సర్వము, సర్వబీజము, సర్వనియంత యగు శక్తి. అందుకే శ్రీ విద్యలో ఒక భాగము వాగ్భవకూటము. ఇక వాక్కునకు రసము అనగా

అర్థము. అర్థము తెలియని వారు వాక్యజ్ఞులు కాజా లరు. లౌకికార్థము సారము, పరమార్థము రసము. ప్రతివాక్కు అనగా శబ్దము లౌకికార్థము ఆయా పదార్థములను చెప్పును. పరమార్థము పరమాత్మను చెప్పును. కావున గీరసజ్ఞులు అనగా వాక్కుల పరమార్థమును తెలిసినవారు అని అర్థము. వాక్కుల పరమార్థమును తెలిసినవారు మాత్రమే వాగ్దేవిని స్తుతించగలరు. వాగ్దేవిని స్తుతించుచున్నారు కావుననే శ్రీదాసులు అగుచున్నారు. అనగా వాగ్దేవి. అనగా శ్రీవిద్య అని అర్థమును తెలిసినపుడు వాగ్దేవిని స్తుతించువారు శ్రీదాసులు అయ్యెదరు. అనగా ఇపుడు వాగ్దేవి శ్రీవిద్యయే అని నిరూపించవలయును. అట్లు నిరూపించుటకు శ్రీవిద్యను గూర్చి కొంత తెలియుట అవసరము.

తంత్ర సాహిత్యమున మహా విద్యలుగా పేరుపొందిన దశమహావిద్యలలో షోడశి లేదా శ్రీవిద్య అని పేరున్న మహావిద్యయే ప్రధానము. ఈ విద్య త్రిపురసుందరీ వాచకమని తాంత్రికుల సిద్ధాంతము. త్రిపురా లలితాది నామములతో ఒక్క శ్రీవిద్యయే వర్ణించబడుచున్నది. శక్తి సంగమానుసారము సుందరి అనుదానికి నామాం

తరములు. భైరవ, లలితేశ్వర, త్రిపుర, త్రిపుర భైరవ అనునవి మహాశక్తికి నామములు. రూపములు అనంత ములు. కాని పరమరూపము మంత్రము ఒక్కటే. త్రిపుర ఉపాసకుల సిద్ధాంతానుసారము బ్రహ్మాది దేవతలు త్రిపురా ఉపాసకులే. త్రిపురా పరమ స్వరూపము. ఇంద్రియాతీతము. మనసునకూ అతీ తమే. కేవలము ముక్తులు మాత్రమే త్రిపురను తెలియ జాలుదురు. ఈ శ్రీవిద్య లేదా త్రిపురసుందరి పూర్ణాహంతామయము. తురీయరూపము. పరమ రూపము వాసనామయము. అనగా మనోమయము అని భావము. సూక్ష్మరూపము మంత్రాత్మకమైననూ శ్రోత్రవాగింద్రియముల కతీతముగా నుండును. స్థూలరూపము కరచరణాది సంపన్నము. కరనేత్రా దీంద్రియ విషయము. శ్రీవిద్యా ప్రవర్తకులు 12 మంది.

1. మను 2. చంద్ర 3. కుబేర 4. లోపాముద్రా 5. మన్మథ 6. అగస్త్య 7. అగ్ని 8. సూర్య 9. ఇంద్ర 10. స్కంధ 11. శివ 12. దుర్వాసులు

శ్రీ విద్యాశక్తి చక్రసామ్రాజ్ఞి. బ్రహ్మవిద్యా స్వరూప ఆత్మశక్తి.

"యత్రాస్తి భోగో నచ తత్రమోక్షో యత్రాస్తి మోక్షో న చ తత్ర భోగః
శ్రీసుందరీ సేవన తత్పరాణాం భోగశ్చ మోక్షశ్చ కరస్థ ఏవ"
అనునది శ్రీవిద్యా ప్రభావము తెలుపును. అనగా భోగమున్నచో మోక్షముండదు. మోక్షమున్నచో భోగముండదు. కాని శ్రీవిద్యోపాసకులకు మాత్రము భోగము మోక్షము కరతలామలకములే అని తాత్పర్యము. శ్రీవిద్య కేవలము తంత్రసిద్ధియే కాదు. వేదానుమోదితము. ఋగ్వేదాన్తర్గత శాంఖాయనారణ్యకమున ఇట్లు వ్రాయబడినది.

"తిస్రః పురః త్రిపథః విశ్వ చర్షణీయత్రా
కథా పరాసన్నివిష్టా అధిష్ఠాయై కామజరా పురాణే మహత్తరా
మహిమా దేవతానాం కామో యోనిః కమలా వజ్రపాణిః"
అని.

దేవీ ప్రధాన స్థానములు మూడు 1. కామగిరి (పూర్వసాగరతీరము) 2. జాలన్ధరము (మేరు శిఖరము) 3. పూర్ణగిరి (పశ్చిమ సాగరతీరము)

దేవీరూపములు 12. 1. కామాక్షి (కంచి) 2. భ్రమరీ (మలయగిరి) 3. కుమారి (కన్య) 4. అంబా (ఆనర్త–గుజరాత్) 5. మహాలక్ష్మి (కరవీర) 6. కాలికా

(మాలవ) 7.లలితా (ప్రయాగ) 8.విన్ధ్యవాసినీ (వింధ్యాచల) 9.విశాలాక్షి (కాశి) 10.మంగల చండి (గయు) 11.సుందరి (బంగాల్) 12.గుహ్యేశ్వరి (నేపాల)

శ్రీవిద్య మూడు విధములుగా నుండును. 1. కాది విద్య 2. హాది విద్య 3. కహాది విద్య

ఈ మూటిలో కాదివిద్య గాయత్రీగుప్త రూపము. గాయత్రీ తత్త్వము నాలుగు వేదములలోనూ ప్రసిద్ధము. వేదసారము గాయత్రి. వేదము చతుర్దశ విద్యల సారము. ఈ విద్యలను తెలిసినచో శక్తి స్వరూపము తెలియును. కాదివిద్యలో మూడు కూటములు కలవు. 1. వాగ్భవ కూటము 2. కామరాజ కూటము 3. శక్తి కూటము. వాగ్భవ కూటమున 18 వర్ణములు, కామరాజ కూటమున 22 వర్ణములు, శక్తికూటమునం 18 వర్ణములు. మొత్తము 58 వర్ణములు.

వాగ్భవకూటమున వర్ణసమూహము బిందుహీనము ప్రళయాగ్ని సదృశము. (క్లీం) ఈ కూటము మూలాధారమునుండి అనాహతము వరకు వ్యాపించి యుండును. ఇక కామరాజ కూటమున గల వర్ణసమూహము బిందుహీనము. కోటిసూర్యులులా

ప్రకాశించునది. అనాహతము నుండి ఆజ్ఞాచక్రము వరకు వ్యాపించియుండును. శక్తికూటమున వర్ణ సమూహము బిందుహీనము. చంద్రవత్ప్రకాశము. ఆజ్ఞాచక్రము నుండి లలాటము వరకు వ్యాపించి యుండును.

సుషుమ్నానాడి మూలమున అగ్రభాగమున రెండు విడివిడిగా సహస్రదళ పద్మములుండును. ఒకటి రక్తవర్ణము. ఊర్ధ్వముఖము. రెండవది శ్వేతవర్ణము. అధోముఖము. ఈ రెండు కమలముల మధ్యన అష్టదళ పద్మములు 30 ఉండును.

శ్రీవిద్య వైదిక ప్రామాణ్యము కల ఆగమవిద్యలలో అంతర్భవించును. ఇవి అయిదున్నవి. ఈ అయిదింటిని శుభాగమ పంచకమందురు. 1.వసిష్ఠ సంహితా 2.సనకసంహితా 3.శుకసంహితా 4.సనందన సంహిత 5.సనత్కుమార సంహిత

వైదిక మతమున శ్రీవిద్య షోడశ నిత్యాసమావిష్టగా ప్రసిద్ధిగాంచినది. ఈ షోడశనిత్యలలో ప్రతి ఒకనిత్య అష్టవర్ణాత్మకము. కావుననే అష్టదళ పద్మములోని అష్టపత్రములలో నుండును. మొత్తము కలిసి 64 తంత్రము లగును. 8X8=64. మరియు అష్టకోణ

చక్రమున పూర్వకోణము నుండి ఒక్కొక్క కోణమున 2,2 చొప్పున 16 నిత్యలుండును. ఇట్లు షోడశనిత్యలు షోడశదలములందు షోడశ స్వరములుగా రెండు దశారములందు అంతర్భూతములగును. ఈ షోడశ నిత్యలలో లోపలి రెండు నిత్యలు త్రికోణమున బిందురూపమున నుండును. మిగిలిన 14 నిత్యలు 14 కోణములలో అంతర్భూతములగును. ఇక మేఖలాత్రయము భూపురత్రయము బైందవమున త్రికోణమున అంతర్భవించును. ఈ అంతర్భావమునే మేరు ప్రస్తారమందురు.

సనందన సంహితలో ఈషోడశనిత్యలు చంద్రకలా చక్ర విద్యకు అంగరూపములని చెప్పబడినవి. ఇట్లే షోడశనిత్యలు స్వరాత్మకమగు పంచదశాక్షరీ మంత్ర ములో నుండు ఏకారాది అకార విసర్గాత్మక సకారము ద్వారా సంగ్రహించబడి జీవకళారూపమున బైందవ స్థానమున ముందు బైందవములో అంతర్భూతమగును. క నుండి మ వరకున్న వర్ణములు పాశాంకుశ బీజమై అష్టారమున ద్వాదశ కోణమున అంతర్భూతమగును. మిగిలిన అన్ని వర్ణములు అనగా య నుండి 9 వర్ణములు రెండుమార్లు ఆవృత్తమగును. చతుర్దశార

కోణమున అంతర్భవించును. ఇక మిగిలిన నాలుగు వర్ణములు నాలుగు శివచక్రములందు అంతర్భూతము లగును. ఈ అంతర్భావమునే కైలాస ప్రస్తారమందురు. దీనిని అనుసరించి అన్ని నిత్యలు చక్రవిద్యలో అంతర్భూతములు అనగా అంగరూపములు అని అభిప్రాయము.

ఇక సనత్కుమార సంహితలో ఇట్లు చెప్పబడినది.

శ్రీ చక్రమునకు అంగరూపములగు షోడశనిత్యలు వశిన్యాది అష్టశక్తులతో ఒక్కొక్క దానిలో రెండు చొప్పున బైందవ త్రికోణములను విడిచి అష్టకోణ ములలో అంతర్భవించును. మధ్యన త్రిపురసుందరి విరాజమానయగును.

వశిన్యాదులు - 8

నిత్యలు - 16

యోగినులు - 12

గంధాకర్షిణ్యాదులు - 4

ఇచట ఒక శక్తిని వదిలి 43 కోణములలో 43 మంది దేవతలు అంతర్భవించెదరు. త్రిపుర సుందరి బిందుస్థానము క్రింద గంధాకర్షణ్యాది నాలుగు

ద్వారవములలో ఉండును. ఈ అంతర్భావవమును భూప్రస్తారమందురు. ఈ విషయమునే సౌందర్య లహరిలో 17వ శ్లోకములో ఇట్లు చెప్పిరి.

"సవిత్రీభిర్వాచాం శశిమణిశిలా భంగరుచిభిః
వశిన్యాద్యాభి స్త్వాం సహ జనని సంచింతయతియః
స కర్తా కావ్యానాం భవతి మహతాం భంగిరుచిభిః
వచోభి ర్వాగ్దేవీవదనకమలామోద మధురైః.

అమ్మా! వాక్కులను సృజించువారు, చంద్రకాంత మణుల శకలములవలె తెల్లనైన దేహకాంతి కలవారు వశిని మొదలగు ఎనిమిది శక్తులు, 12మంది యోగినులు, గంధాకర్షిణిలోనగు నాలుగు శక్తులు అను వారితో కూడిన నిన్ను ధ్యానించువాడు కాళి దాసాదుల కవితవలె సరసములు సరస్వతీ ముఖ కమల పరిమళములను వెదజల్లు మృదుమధురములగు వాగ్గుంభనలతో ప్రబంధములను రచింప సమర్థుడగు చున్నాడు అని పై శ్లోకమునకు అభిప్రాయము.

వశిని, కామేశ్వరి, మోదిని, విమల, అరుణ, జయిని, సర్వేశ్వరి, కౌలిని అను 8మంది శక్తులు.

1.విద్యాయోగిని, 2.రేచికాయోగిని, 3.మోచికా యోగిని, 4.దీపికా యోగిని, 5.జ్ఞానయోగిని,

6.ఆప్యాయనీ యోగిని, 7.వ్యాపినీయోగిని, 8.మేధా యోగిని, 9.వ్యోమరూప, 10.సిద్ధిరూప, 11.లక్ష్మి, 12.అమృతాయోగిని అని 12 మంది యోగినులు.

ఇక గంధాకర్షిణి, రసాకర్షిణి, రూపాకర్షిణి, స్పర్శాకర్షిణి అనునవి నాలుగు శక్తులు కూడిన నాలుగు ద్వారములు కలది. ఇట్లు ద్వాదశ యోగినులతో వశిన్యాది అష్టశక్తులతో కలిసి ఇరువది కళలు శుద్ధస్ఫటిక సంకాశములై దశారయుగ్మము కోణము లందు ధ్యానింపబడి పైన చెప్పిన ఫలము నొసంగును. దీనినే భూప్రస్తారమందురు.

ఇట్లు మేరు ప్రస్తారము, కైలాస ప్రస్తారము, భూ ప్రస్తారము అను మూడు ప్రస్తారములు. మేరు ప్రస్తారమనగా షోడశీ నిత్యాతాదాత్మ్యము. కైలాస ప్రస్తారమనగా మాతృకా తాదాత్మ్యము. భూ ప్రస్తారమనగా వశిన్యాది తాదాత్మ్యము. వివరముగా తెలియగోరు వారు సౌందర్యలహరిలోని పదునొకండవ శ్లోక వ్యాఖ్యానమును చూడవలయును.

ఇంతవరకు చెప్పినదంతయూ కౌలమతాభాసము లోని అల్ప భాగముగా గుర్తించవలయును. కాని నిజముగా తాంత్రిక సాహిత్యమును చక్కగా పరిశీలించి

నచో ఈ విషయమున చాలా విస్తృతాంశములు తెలియును. ఈ విధానముతో పరిశీలించినచో కౌలమతము పూర్వోత్తర భేదముతో రెండు భాగములుగా నుండును.

పూర్వకౌల మతానుసారముగా భగవతీ, పరా, **సంవిత్**, ఆనందభైరవి నామమున నుండును. ఈమెయే భగవంతుడు లేదా శివుడు లేదా ఆనందభైరవుని శరీరరూపము. ఈ ఆనందభైరవికి సూర్యచంద్రులు రెండు స్తనములు. నవశంభులు ఆత్మ. ఇచట శంభుడు ఆనందభైరవుడు అని తెలియవలయును. ఈ ఆనంద భైరవుని స్వరూపమున నవవ్యూహములు ఒకటై యుండును. భైరవ భైరవి ఈ ఇద్దరిలో శేషశేషి భావముండును. భైరవుడు శేషి భైరవి శేష లేదా భైరవి శేషి భైరవుడు శేషము. ఈ సమరసమే పరానందముగా పిలువబడును. ఈ శేషశేషిభావమునే చక్కగా విశేష విధానములో పరిశీలించి గ్రహించవలయును.

ఇందులో ఇవి నవవ్యూహములు.

1. కాల వ్యూహము. నిమేషాది కల్పాన్తము అవిచ్ఛిన్న కాలము. సూర్యచంద్రులు కాలావచ్ఛేదకులు కావున కాలవ్యూహమున అంతర్భవింతురు.

2. కులవ్యూహము. అనగా నీలాది రూపవ్యూహము.
3. నామవ్యూహము. దీనినే సంజ్ఞా స్కంధమందురు.
4. జ్ఞానవ్యూహము. దీనినే విజ్ఞాన స్కంధమందురు. ఇది సభాగ విభాగరూపములతో రెండు విధములు. సభాగమనగా సవికల్పము. విభాగమనగా నిర్వికల్పము అని తెలియవలయును.
5. చిత్తవ్యూహము. దీనికే అహంకార స్కంధము అని చిత్తస్కంధమని బుద్ధి స్కంధమని, మహత్ స్కంధము, మనస్స్కంధము అని అయిదు పేర్లుండును.

6. నాదవ్యూహము. రాగ ఇచ్ఛాకృతి ప్రయత్నములు స్కంధమను పేర్లతో వ్యవహరించబడును. ఇంతే కాదు మాతృక యొక్క నాలుగు భేదములు కూడా నాదవ్యూహమున అంతర్భవించియుండును. పరాదులు కూడా ఇందుల్లోన్నే అంతర్భవించును. ఇచట పరా అనగా ఊహ లేదా తర్కసహితమగు స్ఫురణము అని అర్థము. యోగులు యోగములో నున్నపుడే ఈ పర అవగతమగును. కామకలా విద్యలో ఈ పరనే మాహేశ్వరి అందురు. ఈ

పరావాక్కు అపేక్షానుగుణముగా స్పష్టరూపముగా ప్రతిభాస మానమగునపుడు పశ్యన్తిగా మారును. పశ్యన్తి అయినపుడు త్రిమాతృకారరూపమై చక్రరూపమును ధరించును.

"స్పష్టా పశ్యన్త్యాది మాతృకాత్మా చక్రతాం యాతా" అని 'ప్రమాణమాన్య' మనబడు సనత్కుమార సంహితలో చెప్పబడినది. త్రిమాతృక అనగా ఖండత్రయయుతమగు పంచదశాక్షరీ మాతృక. ఈ మాతృకయే చక్రరూపముగా పరిణతమగును. పశ్యన్తీ వాక్కు. యోగ్యమగు అవస్థలో అతిసూక్ష్మ రూపమున అనుభవమునకు వచ్చును. పరాపశ్యన్తి వాక్కులనుండి మధ్యమావాక్కు పుట్టును. ఈ మధ్యమవాక్కు స్థూల సూక్ష్మ రూపములో రెండువిధములు. వామా, జ్యేష్ఠా, రౌద్రి అంబికా అను నాలుగు శక్తుల సమష్టి అవస్థయే సూక్ష్మ యగు మధ్యమ. ఈ నాలుగింటి వ్యష్టి అవస్థయే స్థూలమధ్యమ. వామాది నాలుగు శక్తులే శ్రీచక్రాంతర్గతమగు ఊర్ధ్వముఖమగు యోని స్వరూపము. ఈ నవ వ్యూహాత్మకమగు శక్తులకు కారణమగు భగవతి నవాత్మకమనబడును.




7. బిందువ్యూహము – ఇదియే షట్చక్రసంఘము
8. కలావ్యూహము – ఇది వర్ణాత్మకము. పంచాశత్కలా సమూహము
9. జీవవ్యూహము – ఇది భోక్తృవర్గము అనబడును.

ఈ నవ వ్యూహములు ఒక్కొక్కటి భోక్త, భోగము, భోగ్యము అని మూడు విధములుగా నుండును. ఇందులో భోక్త ఆత్మవ్యూహము. భోగము జ్ఞాన వ్యూహము. భోగ్యము కాలవ్యూహాది సముదాయము. అన్ని వ్యూహములు జీవవ్యూహములో అన్వయించి యుండును. కావున ఇదియంతయూ ఐక్యము కాలవ్యూహము అవచ్ఛేదము. కావున కాలవ్యూహమున ఐక్యమున నాదము కళ ఒకటైనపుడే పరమేశ్వరుని నవవ్యూహ రూపమేర్పడును. కావుననే భైరవ భైరవీ

మధ్యలో నవవ్యూహముల ఐక్యము అంగీకరించబడి నది. ఇదియే కౌలమతము. కౌలమతమున పరమేశ్వ రుడు నవాత్మకుడు. కౌలగణమున ఇట్లు చెప్పబడినది.

నవవ్యూహ్యాత్మకో దేవః పరానన్ద పరాత్మకః।
నవాత్మా భైరవో దేవః భక్తిముక్తి ప్రదాయకః॥
పరానన్ద పరాశక్తి శ్చిద్రూపానన్ద భైరవీ।
తయో ర్యదా సామరస్యం సృష్టిరుత్పద్యతే తదా॥

మొదట చెప్పబడిన ఆనందభైరవుడు పరాభైరవుల తాదాత్మ్యమే. ఇద్దరి రూపసామ్యముచే నవాత్మక మగును. ఇచట చెప్పబడిన శేషశేషి భావము సాపే క్షము. సృష్టి ప్రారంభమున భైరవీ భైరవుల ప్రయత్నము ఉత్పన్నమైనపుడు భైరవికి ప్రాధాన్య మేర్పడును. కావున మహాభైరవిని ప్రధానము ప్రకృతి మొదలగు నామము లచే పిలుచుచుందురు. ఇచట భైరవి ప్రధానము కావున భైరవి శేషియగును. అపుడు ఆనందభైరవుడు అప్రధా నము అగును కావున శేషము అగును. ఇక ఉపసంహార కాలమున అనగా ప్రళయకాలమున ప్రకృతి తన్మాత్ర రూపమున ఉంటుంది. భైరవి స్వాత్మలో అంతర్భూత మగును. అపుడు భైరవుడు శేషియగును. భైరవి శేషయగును. సంహార కాలమున కార్యకారణోప సంహా

రము తరువాత స్వయముగా కారణరూపమున నుండును. ఇది పూర్వ కౌలమతము యొక్క సారాంశము.

ఉత్తర కౌలమతానుసారము ప్రధానమే జగత్కర్త. ప్రధానమగుటచే అది ఎన్నటికీ శేషము కాజాలదు. ఇచట శివుడు లేడు. పంచతత్త్వరూపమున పరిణతి చెందును. ప్రధానాత్మకమగు శక్తియే మనస్తత్త్వాది రూపమున పరిణామము చెందును. ఈ శక్తి కార్య రూపమగు సమస్త ప్రపంచమును తనలో లీనము చేసుకొని కారణరూపముగా నున్నపుడు ఆ శక్తిని ఆధారకుండలిని అందురు. ఇది సంక్షేపముగా పూర్వ కౌలమతము కన్నా ఉత్తర కౌల మతములో నుండు వైలక్షణ్యము.

సమయిలకు షట్చక్ర పూజనము నియతముకాదు. కాని సహస్ర కమల పూజనము మాత్రము నియతము. ఈ సహస్రకమలము బైందవస్థానము అగుటచే మధ్యవర్తియగు చంద్రమండలమును చతురస్ర రూపమున అనుసంధానము చేయవలసి యుండును. ఈ చతురస్ర మధ్యమున నున్న బిందువు పంచవింశ తత్త్వాతీతమగును. షడ్వింశాత్మకమగును. అనగా

శివశక్తి మిలనాత్మకమగు సాదాఖ్య రూపమున అను సంధానవము చేయవలయును. కావున సమయి మతమున బాహ్యారాధన ఉండదు.

భగవత్తత్త్వము నాద బిందుకలాతీతము. ఇదియే ఆగమ రహస్యము. నాదము నుండి పరాపశ్యన్తి మధ్యమ వైఖరులు తెలియబడును. వీటిలో పరా త్రికోణచక్రము. పశ్యన్తి అష్టకోణ చక్రము. మధ్యమ దశారము. వైఖరీ చతుర్దశారము. అన్ని శివచక్రములు ఈ నాలుగింటిలోనే అంతర్భావము చెందును. చతుశ్చక్రాత్మకమగు శ్రీచక్రము నాదము. మూలాధారాది షట్చక్రము బిందువు. కళలు 50, లేదా 360. భగవతి ఈ నాదబిందు కలలకంటె అతీతురాలు, సహస్రదళ కమలము బిందుకంటే అతీతము. బైందవస్థానమును సుధాసింధువు లేదా సరఘ అందురు. బిందువులో నుండు సుందరి నాదాతీత సుందరి. ఇది పంచాశద్వర్ణాత్మకము. 360 సంఖ్య కలది. మహాకాలరూపము పంచదశకలాతీతము. సాదాఖ్య శ్రీవిద్య, చిత్కల, బ్రహ్మవిద్య, భగవతియందురు. కావుననే భగవత్తత్త్వము నాదబిందు కలాతీతము అని చెప్పబడినది. ఈ నాద బిందుకలలు పరస్పరము 6 విధములుగా ఐక్యాను సంధానమగును. ఈ ఆరు విధముల ఐక్యాను

సంధానవము ద్వారా పూజించినచో సాదాఖ్యలో విలీనమగును. తరువాత 6 విధముల ఐక్యాను సంధాన ప్రభావము ద్వారా భగవతి పరాసంవిత్ అకస్మాత్తుగా మూలాధార స్వాధిష్ఠాన చక్రములను భేదించుకొని మణిపూరమున ప్రకటమగును. ఇట్లు ప్రకటమైన భగవతిని ఆరాధించు విధానమునకు కౌలమని పేరు. ఈ ఆరాధనలు మతభేదములచే చాలా కలవు. వాటిని గ్రంథవిస్తర భీతిచే ఇచట వివరించుటలేదు. ఇట్లు ఆరాధన లేదా ఉపాసన మరియు శ్రీ సాక్షాత్కారము ఆచార్యానుగ్రహము లేనిదే కలుగదని సర్వామోదిత సిద్ధాంతము. కులార్ణవమున ఈ విషయమే చెప్పబడినది.

"గురోః కృపా యస్య భవేత్ప్రభూతా శ్రీ దేవతాయాశ్చ మహాన్ ప్రసాదః
తస్యైవ పుంసః కులశాస్త్రబోధః తస్యాత్ర భక్తిర్న కదాప్యనోద్యా
యేషాంధృఢాభక్తి రిహాస్తి శాస్త్రే విదన్తి సమ్యక్ సకలం రహస్యం
ప్రాగ్జన్మపుణ్యా ద్విమలా మనీషా తే నిన్దకా నాస్య భవన్తిలోకాః

కౌలజ్ఞాన ప్రాశస్త్యము కౌలజ్ఞాన దౌర్లభ్యము కూడా కులార్ణవమున ఇట్లు చెప్పబడినది.

పురాకృత తపోదానయజ్ఞతీర్థ జపవ్రతైః
శుద్ధ చిత్తస్య శాన్తస్య ధర్మిణో గురుసేవినః
అతిగుప్తస్య భక్తస్య కౌలజ్ఞానం ప్రకాశతే

కావున పూర్వోత్తర కాల మతానుసారముగా శ్రీదేవి, శ్రీవిద్య, శ్రీచక్రము శ్రీఉపాసన, ఈ అన్ని భేదములలో ముఖ్యమైనది వాక్కే. అనగా పరాపశ్యన్తీ మధ్యమ వైఖరీ అను నాలుగు భేదములతో విలసిల్లు వాగ్దేవి అనగా శ్రీవిద్య అని స్పష్టముగా నిరూపించ బడినది. అట్టి శ్రీవిద్యలో ప్రధానము ప్రథమము వాగ్భవకూటమే. కావున శ్రీ వాగ్దేవీ స్తుతి అనగా వాగ్భవ కూటమున అధిష్ఠాతయగు వాగ్దేవిని అనగా శ్రీవిద్య నుపాసించుట ఈ స్తోత్రమునకు పరమోద్దే శ్యము అని ఇప్పటికి స్పష్టమైనది.

ఇంతవరకు వాక్కు అనగా శ్రీవిద్య అని నిరూ పించితిమి. ఇపుడిక ఈ శ్రీవాగ్దేవీ స్తవములో శ్రీవిద్యో పాసన ఎలా ఉన్నదో చూతము. మంత్రము ప్రకృతి బీజాక్షరములు ఏ పద్యములలో దాగియున్నవో కూడా చూడవలయును. శ్రీవిద్య, వాగ్దేవి, బాలాత్రిపుర సుందరి, సరస్వతి మహాలక్ష్మి ఇవన్నియూ ఒకేశక్తిని ప్రతిపాదించును. బాలాత్రిపుర సుందరిని 'బాలా' అనియే సంబోధింతురు. 'శ్రీగీరసజ్ఞులు' కూడా ఇందులో 'బాలా' అనియే సంబోధించిరి. దీనివలన ఇది శ్రీవిద్య ఒక త్రిపుర సుందరీ రూపముననే కాక

కాళీ దుర్గ సరస్వతి లక్ష్మి రూపములలో అనగా త్రిమాతల రూపములో కొలువబడుచుండును. ఇచట 'శ్రీదాసులు' వాగ్దేవీ నామముతో కేవలము చదువుల రాణియగు ఒక సరస్వతిని మాత్రమే కాక ముగు రమ్మల రూపములో వెలుగొందు 'బాల'నే ఉద్దేశించి స్తుతించిరనుటకు ఈ పద్యము ప్రత్యక్షర ప్రత్యక్ష ప్రమాణము.

కాళీరూపము వాణిరూపు పరగన్ కళ్యాణి శ్రీలక్ష్మియున్
నీ లీలా సరసాకరాకృతి మతిన్ నేనెట్లు గుర్తించెదన్?
నాలో నిత్యము వెల్గు దీపమును నీ నామామృతమున్ బోసి ఓ
బాలా! జ్ఞానసరస్వతీ! సమముగా వాగ్జ్యోతి దీపింపుమా! (96)

ఇంతేకాదు గీరసజ్ఞులు తమ స్తుతిలో స్పష్టముగా ఇది శ్రీవిద్యోపాసన అని తెలుపుటకు పైన నేను వివరించిన శ్రీవిద్యా భేదములందు శక్తి వాగ్భవ కామరాజ కూటములను స్పష్టముగా పేర్కొనినారు. చూడుడు.

శ్రీమంతంబయి సర్వశక్తియుతమై శృంగార సౌందర్యమై
ధీమంతంబయి హ్రీయుతంబు వదనోద్దీప్తాంతరాక్లిష్టమై
కామేశాధి కృతంబునై సకలమై కైవల్య పూరంబునై
నామాకారము నొప్పుచుండ వెలసెన్ వాగ్భావకూటంబునై

ఈ పద్యమున కేవలము శక్తి కామ వాగ్భవ కూటములే కాక శ్రీవిద్యకు మూల బీజములగు శ్రీ, ధీం, హ్రీం, క్లీం, ఐం, రం అనుఆరు వర్ణములను రహస్యముగా కొంత ప్రకాశముగా బోధించి యున్నారు. ఈ ఆరింటిలో ప్రధానములగు 'ఐం, రం' అనువాటిని రహస్యముగా సూచించియున్నారు. ప్రతిపాదమున చివరి వర్ణమును 'ఐ'గా అందుకే ఉంచినారు. కేవలము ఛందస్సునకు కాదు. 'శ్రీదాసు'లకు ఛందోదారిద్ర్యము, భీతి కలుగనేరదు కదా. 'క్లీం' అను దానిని కూడా 'ఉద్దీపాంతరాక్లిష్ట' అను పదముచే సూచించిరి. ఇక 'ర' బీజము అగ్నికావున ప్రచ్ఛన్నముగా నుంచవలయును కదా! జ్యోతి కావలసిన వారు వెదకి కనుగొనుటే ఉచితము.

ఈ పద్యమును కూడా చూడుడు.

ఓంకారము రూపమనగ హ్రీంకారము శక్తియంచు నెరిగిన వారల్
ధీంకారము బీజమనుచు శ్రీంకారము చేర్చి నిన్ను సేవింతు రిలన్.

వివరణతో పనిలేదు కదా. ఇక ఈ స్తోత్రమున ఎన్నోమార్లు ముగురమ్మల పేర్లను శ్రీ, వాణీ, భవానీ నామములను స్పష్టముగా చెప్పియున్నారు. ఇది శ్రీవిద్యోపాసన కానిచో ఆ మూడు పేర్లను చెప్పవలసిన

పనిలేదు. అంతేకాదు వాగ్భవశక్తికామరాజ కూటము లను కూడా మూడు నాలుగుమార్లు ప్రయోగించి యున్నారు. మరియు మనము పైన వాగ్భవ కూట మును వివరించుచు పరాపశ్యంతి మధ్యమ వైఖరి అని నాలుగు ఖీధములను చెప్పుకున్నాము. ఈ నాలుగు పేర్లను కూడా అక్షరశః చెప్పియున్నారు. చూడుడు.

తే.గీ. ''సత్త్వరజములు తమమును సంతరించి
ప్రకృతి సృజియించి పోషించి ప్రళయపరచు
పరయు పశ్యంతి మధ్యమ వైఖరులను
ప్రణవరూపిణి వాగ్దేవి ప్రణుతి సేతు.''

ఈ పేర్లను ఇంకా మూడు నాలుగు పద్యములలో చెప్పియున్నారు. ఇంతియే కాదు. శ్రీవిద్య, శ్రీచక్ర శోభిత, షోడశి, వేధాధివాహ, షడ్చక్ర మొదలగునవి శ్రీవిద్యకు ప్రసిద్ధినొందిన సంకేతములు. కేవలము బ్రహ్మపత్నిగానున్న సరస్వతిని మాత్రమే నుతించదలచి నచో ఈ సంకేతములను ప్రయోగించవలసిన పనిలేదు. ఈ పద్యమున శ్రీవిద్యా రహస్యమును గీరసజ్ఞులు చక్కగా తెలిపియున్నారు.

సీ. సకల వేదాలలో సమరస ప్రణవంబు
స్మృతులలో శోభిల్లు ఋషుల బోధ

ఉపనిషదంతస్థ తపనార్థ తత్త్వంబు
అష్టాదశ పురాణ సార్థతనువు
పదునాల్గు శాస్త్రాల వాక్యార్థసారంబు
సాహిత్యకావ్యాత్మ సరసచర్చ
ఇతిహాసవాఙ్మయ ప్రతిపాదితార్థంబు
వామకేశ్వరతంత్ర వాక్యమూర్తి

తే.గీ. షోడశీమంత్ర శ్రీచక్ర శోభితాంగి
కామరాజవాగ్భవ శక్తినామకూట
దేహషట్చక్ర వేధాధివాహయగుచు
సరస వాగ్దేవి సంపూర్ణ వరములిడుత.

ఈ పద్యమును చూచిన తరువాత మన సందేహము లన్నియూ తొలగి ఇది సుస్పష్టముగా శ్రీవిద్యోపాస నయే అని తెలియుదుము. ఇంతియేకాదు వాసరలో వేంచేసియున్న జ్ఞానసరస్వతి శ్రీవిద్యయే అని నిరూ పించుట కూడా 'శ్రీదాసుల' అభిమతము. అందుకే బీజాక్షర భూయిష్ఠముగా కూటత్రయము, నామ త్రయము, మాతృత్రయము, వర్ణత్రయము మొదలగు వాటిని ప్రయోగించి మనకు తమ అభిమతమును స్పష్టముగా చాటినారు. శ్రీవిద్యయే సరస్వతి, లక్ష్మి,

పార్వతి, ప్రణవరూపిణి వాగ్దేవి, త్రిగుణాత్మక సృష్టి స్థితిలయకారిణి అని ఈపద్యమున విస్పష్టముగా చెప్పుచున్నారు. చూడుడు.

సీ. ప్రాభాత సంధ్యలో పంచాస్యగాయత్రి
బ్రాహ్మిగా తర్పణార్హయగు నిమ్మృజి
మాధ్యాహ్నికంబులో మాహేశి సావిత్రి
రౌద్రిగా తర్పణార్హయగు నిమ్మృజి
సాయంపు వైష్ణవి సరస సరస్వతి
హంసగా తర్పణార్హయగు నిమ్మృజి
ముప్పొద్దు సంధ్యలో ముచ్చాంపు
శ్రీదేవి మూడుగుణములకు ముద్దుగుమ్మ

తే.గీ. సత్త్వరజములు తమమును సంతరించి
ప్రకృతి సృజియించి పోషించి ప్రళయపరచు
పరయు పశ్యంతి మధ్యమ వైఖరులను
ప్రణవ రూపిణ వాగ్దేవి ప్రణుతి సేతు.

తరువాతి పద్యములో కూడా ఈ విషయమునే ప్రతిపాదించియున్నారు.

సీ. పగడాల ప్రభలతో భాసించునొడలుతో
లక్ష్మీప్రదాత్రియా లక్ష్మియగుచు

జాబిల్లివెలిచాయ చక్కనౌ మెయితోడ
సకలవిద్యాదాత్రి శారదౌచు
చీకటి గానుగు చెట్టులా నల్లనౌ
కాలశత్రు విఘాతి కాళియగుచు
మూడుమూర్తుల నొప్పు మువ్వంపు
వాగ్దేవి త్రిగుణాత్మశక్తియై తేజరిల్లు

లక్ష్మి కాళి వాణి లక్షణంబులతోడ
ముడుగుణము లొప్పు మూర్తియగుచు
వాణిరూపు దాల్చి వాసరాపురియందు
వరలుచున్నదేవి ప్రస్తుతింతు.

శ్రీవాగ్దేవీ స్తవము శ్రీవిద్యోపాసనయే అని నిరూపించుటకు మరికొన్ని దృష్టాంతములను చూతము. శ్రీవిద్యలో నవావరణలలో ప్రకృతి బీజములు చాలా ముఖ్యమైనవి: ప్రకృతిలో పృధివి చన్ద్ర శివ కామకల, విష్ణు అగ్ని కామేశ్వర త్రిశక్తి పరబ్రహ్మాత్మక బీజము లుండును. సంగ్రహముగా ప్రకృతి బీజముల విధానము ఇట్లుండును :

| | ప్రకృతి | బీజ |
|---|---|---|
| పృధివీ | లం | అం ఆం సౌః |
| చంద్ర | సం | ఐం క్లీం సౌః |
| శివ | హం | హ్లీం క్లీం సౌః |
| కామకలా | ఈ | హైం హ్లీం హ్సౌః |
| విష్ణు | ఏం | హ్సైం హ్స్క్లీం హ్సౌః |
| అగ్ని | రం | హ్రీం క్లీం బ్లేం |
| కామేశ్వర | కం | హ్రీం శ్రీం సౌః |
| త్రిశక్తి | నాద | హ్స్రై హ్స్క్లీం హ్స్రౌః |
| పరబ్రహ్మ | బిందు | పంచదశి తురీయ విద్యా |

ఈ రెండు విధముల బీజ ప్రకృతులను నిశితముగా పరిశీలించినచో మూడు కూటములు స్పష్టముగా తెలియవచ్చును. అవి వాగ్భవ కామరాజ శక్తి కూట ములు. ఈ మూడు కూటముల బీజములు కూడా 'క ఏ ఈ ల' హసకల, సకల అనికదా? సంగ్రహ ముగా చెప్పవలయునన్న కాది, హాది సాది అనికదా తాంత్రికులరూఢి. ఇవికాక అగ్ని ప్రకృతియగు రం అనుదానిని నాదబిందువులను చేర్చినచో మొత్తము

ప్రకృతి బీజములు పరిపూర్ణమగును. కావున క స హ ల ఈ ఏ ర నాద బిందు ఈ తొమ్మిది స్థూలముగా నవావరణవములలోని ప్రకృతి బీజవములు. ఈ బీజప్రకృతులు ఆద్యక్ష రవములుగా ఆ వాగ్దేవికి నామములు ప్రసిద్ధినొందినవి.

| | | |
|---|---|---|
| క | = | కాళి |
| స | = | సర్వమంగళ |
| హ | = | హంస |
| ల | = | లక్ష్మి |
| ఈ | = | ఈశ్వరి |
| ఏ | = | ఏకవీర |
| ర | = | రాజరాజేశ్వరి |
| నాద | = | నాదమయి |
| బిందు | = | బిందురూపిణి, లేదా బైందవి |

ఈ నామములోని అంతరార్థము పరమార్థము కూడా శ్రీవిద్యలోని నవావరణలలో ముఖ్యమగు ప్రకృతి బీజములను మనకు తెలియకనే ఉచ్ఛరించుటయే. శ్రీ వాగ్దేవీ స్తవము కూడా శ్రీవిద్యోపాసనయే అనుటకు ఈ ప్రకృతి బీజములు ఆద్యక్షరములుగా

ఎన్ని పద్యములలో వాడిరో ఒక్కసారి చూతము.

| | | | |
|---|---|---|---|
| క | ఆదియందుకల పద్యములు | - | 12 |
| స | ఆదియందు కల పద్యములు | - | 5 |
| హ | ఆదియందు కల పద్యములు | - | 2 |
| ల | | - | 2 |

ఈ కి బదులుగా శ్రీ అను దానిని వాడి 15 పద్యములను వ్రాసినారు. ఈ ప్రకృతి వ వికృతి. శ్రీవిద్యకు వాగ్దేవి అను నామమునకు కారణము ఇదియే. శ్రీం క్లీం హ్రీం ఐం వం రం యం లం, హం, స అనునది శ్రీవిద్యలోని ఆవృత్త బీజములు. ఈ బీజములకు మూలబిందువు ఈ అనునదే. కావున ఈ కి బదులుగా శ్రీ అనునది ఉపయోగించుట తంత్రాభిజ్ఞుల సమయమే అనుట నిస్సందేహము.

| | | | |
|---|---|---|---|
| శ్రీవాగ్దేవీ స్తవములో | ఏ | - | 5 |
| | ర | - | 5 |
| | నాద | - | బిందువులను నామములుగా |

నాలుగు మారులు ప్రయోగించిరి. ఇక ఈ స్తవములో హంస అన్న పదమును ఎన్నిమార్లు ప్రయో

గించిరో, పైన చెప్పిన బీజ ప్రకృతులు ఆదియందు కల పదములను పాదములను ఎన్నిమార్లు వాడారో చదువరులు నిశితముగా పరిశీలించుటే ఉచితము. వాటిని లెక్కించి ఇచట చూపించుట గ్రంథ విస్తరమునకు దారితీయును. అందుకే ఆ ప్రయత్నమును చదువరులకే వదిలివేయుచున్నాను.

ఇంతవరకు శ్రీవాగ్దేవీ స్తవము శ్రీవిద్యోపాసనయే అని నా బుద్ధికి తోచిన మేరకు వివరించియున్నాను. ఇంకా సూక్ష్మేక్షికతో పరిశీలన చేసినచో చాలా విషయములు బయటపడగలవు. ప్రతిపద్యము బీజాక్షరాధిష్ఠితమే. కాని దానిని వివరించినచో వ్యాఖ్యానము కాగలదు కాని భూమిక కాదు. గ్రంథవిస్తరము కూడా అగును. ఇట్లు బీజాధిష్ఠితమగుటకు కారణము దీనిని మాధవపెద్ది చిన వెంకన్నగారు వ్రాసినది కాదు. సాక్షాత్తు సరస్వతియే పలికినదని ఈ పద్యమున చెప్పియున్నారు. చూడుడు.

నీ నామ మంత్ర మననము
నే నీమముతో సలుపగ నీవే పలుకన్
నే నాలకించి- వాణీ
నే నీస్తవమును రచించి నీకే యిడితిన్.

సరస్వతి పలికిన దానిని విని చెప్పి ఆమెకే అంకిత మును గావించెను కదా. అందుకే అమ్మ పలుకులో అక్షర విన్యాసమును పరికించగల వారెవరు? ఆ రహస్యములను వాగ్దేవియే తెలియబరుచవలయును.

ఇంతవరకు శ్రీవిద్యోపాసన గురించి వివరించి యున్నాము. ఇక ఇపుడు ఇందులో కవితారీతులను ఇంచుక పరికించెదము. కవితలో మొదట పరిశీలించ వలసినది రసము. ఇది స్తవము కావున ఇందులోని రసము భక్తియని విడిగా చెప్పనవసరము లేదు. అసలు భక్తిరసమా? కాదా? అనువాదము కూడా కలదు. కాని భక్తియే రసము అనునది పరమ సిద్ధాంతము. శృంగారము రసముగా అంగీకరించి భక్తిని రసము కాదనువారు చాలామంది కలరు. ఒకరిపై నొకరికి ఉండు అనురాగము – అనగా పురుషునిపై స్త్రీకి, స్త్రీపై పురుషునికి కలుగు అను రాగమును శృంగారమని అన్నారు. ఇద్దరు పురుషులకు కాని ఇద్దరు స్త్రీలకు కాని ఉన్న అనురాగమును మైత్రి అందురు. భగవంతుని మీద ఉండు అనురాగమును భక్తి అందురు. అనగా అనురాగము అన్నిటిలో అను స్యూతముగా ఉండుట నిర్వివాదాంశము అయినపుడు

నశ్వరము క్షుద్రము అయిన శరీరముపైన కాంక్షతో కలుగు ఆసక్తిని లేదా స్త్రీ పురుష లింగభేదముతో కలుగు రక్తిని రసముగా అంగీకరించి నిత్యము శాశ్వతము సత్యము జీవాత్మ యాథాత్మ్యమును బోధపరిచి పరమాత్మ సన్నిధిని చేర్చు భక్తిని రసముకాదనుట ఎంతవరకు సమంజసమో విజ్ఞులు పరికించు కావుత. కావున నిజమైన రసము భక్తియే. శృంగారము భక్తి ప్రభేదము అనుట యుక్తియుక్తము. అట్లు కానినాడు శతకసాహిత్యమును కావ్యమనజాలము. రసహీనమైన దానిని సాహిత్యమని కూడా అనజాలము. సనాతన కాలము నుండి వచ్చు శతక సాహిత్యమును స్తోత్ర సాహిత్యమును కాదనుట సాహసమే కాగలదు. కావున భక్తి రసమే అని అంగీకరించక తప్పదు. ఆ భక్తికి పరాకాష్ఠను ఈ స్తవములో చూపియున్నారు. ఈ భక్తి ముఖ్యముగా ఆరువిధములుగా నుండును. జ్ఞాన దశలో మూడు. భక్తిదశలో మూడు.

1. పరమాత్మ మనసునకు వాక్కునకు అతీతము. అతనిని చేరుట మన వలన కాని పని. ఇచట ఉండు అతని గుణ విభూతులను తలచుటే మన కర్తవ్యము అని భావించి ధ్యానములో ఉండుట

ఒక భక్తి.

2. పరమాత్మను చూడనిదే ఉండజాలక అతని రూపనామ కథా కీర్తనములు చేయుచు మైమరచుట రెండవది.

3. అతని సేవచేయు భాగ్యము ఎపుడు కలుగునా అని ఎదురు చూస్తూ కాలము గడుపుట మూడవది.

ఈ మూడు జ్ఞానదశలోని భేదములు.

4. పరమాత్మకు అన్నివిధములగు సేవలను తానే చేయవలయును అని ఆశించి నిర్బంధించి సేవలను వరముగా పొందుట తరించుట

5. మానవునిగానే కాక జంతువుగానైనా పరమాత్మను సేవించు భాగ్యమునకై పరితపించుట.

6. అచేతనముగానైనా పరమాత్మముందు నిలుచు భాగ్యము కలుగుటకై తపించుట.

ఈ మూడు ప్రేమదశలోనివి. ఈ ఆరు విధముల భక్తి కూడా రెండు విధములు. భగవంతుని కొరకు భక్తుల కొరకు అని. అనగా భగవంతుని సేవించుట ఆరాధించుట కంటే భగవద్భక్తులను సేవించి ఆరాధించుటయే అత్యుత్తమము అని భక్తాగ్రగణ్యుల

సిద్ధాంతము. కావున వీటిని చక్కగా పరిశీలించినచో భక్తిలో ముఖ్యమగు విధానములు మూడు అని తెలియును.

1. చైతన్య రూపములో భగవంతుని సేవించగోరుట
2. అచైతన్యమగు స్థావర రూపములో సేవించ గోరుట
3. ఈ రెండు రూపములలో భగవద్భక్తులను సేవించ గోరుట

ఈ మూడు రూపముల భక్తినే గీరసజ్ఞులు ఈ స్తవమున కనబరిచినారు.

ఇది భగవంతునియందుగల భక్తి తన్మయతలో అనాది కాలము నుండి భక్తాగ్రగణ్యులు ఇట్లే కోరియున్నారు. యామునాచార్యులవారు "త్వద్దాస్య సుఖైకసంగినాం భవనేష్వస్తు చ కీటజన్మ మే" అని అన్నారు. అనగా 'నీ సేవలో మునుగుటే ఆనందముగా భావించు భక్తుల ఇండ్లలో పురుగుగా పుట్టుకనిమ్ము' అని అభిప్రాయము. ఇట్లే శ్రీవత్సచిహ్నులు "రంగేశ్వర త్వత్పదమాశ్రితానాం రథ్యాశునాం అన్యతమోభవేయం" అని. అనగా నీ భక్తులు నడుచుదారిలోని మెట్లలో ఒకమెట్టుగా ఉంటే చాలు అని భావము. ఇపుడు గీరసజ్ఞుల పద్యములను చూడుడు.

సీ. మల్లెపూవునై నీ చల్లని చరణాల
రాలిపోయిన నేను చాలునమ్మ!
ఒకకేల జపమాల నొప్పుగానౌ దునా
అంతకంటెను నేమి ఆశలేదు
నీరజంబులవంటి నీ రెండుకరములన్
వీణనై పాడుచో వేరు వలదు
వటుకనై చిలుకనై పద్మమై వేదమై
సేవించుచున్నచో చింతలేదు

ఆ.వె. ఎన్ని జన్మ లెత్త నేమి? ఓ వాగ్దేవి!
జన్మ పిదప చావు జన్మ తప్పు!
మనిషికంటె నిత్యమైనట్టి నీ వస్తు
తతియె మిన్న యనుచు దలతునమ్మ!

ఇచట చచ్చుచు పుట్టుచున్న మనిషి కన్నా అచేతనముగా నుండి నీ సేవచేయుట మేలు అన్న తపన భక్తి పరాకాష్ఠ స్పష్టముగా కనపడుచున్నది.

సీ. కోడినై నీ భక్త కోటులన్ మేల్కొల్పి
పూజింపరండంచు బోధసేతు
కోయంచు నెలుగెత్తి కూయుచున్ గీర్తింతు
గుణగణములనెల్ల కోకి లాచు

తొలప్రొద్దు వెలయంగ కిలకిలానాదాల
పొగడుదున్ మహిమలన్ పులుగు నౌచు
నీ యందచందాలు నిరుపమానమటంచు
అందిరి కెరిగింతు హంస నౌచు
ఆ.వె. మనిషి జన్మకంటె మహిలోన వాగ్దేవి
పక్షిజన్మ మిగుల భవ్యమగును
దేవిసేవలోన దినమంత లీనమౌ
స్వార్థపరుడు మనిషి వంచకుండు.

ఇచట స్వార్థపరుడు వంచకుడగు మనిషికంటె పక్షిజన్మ మేలని అందులో దేవిసేవచేయు పక్షిజన్మ మేలని ఎలుగెత్తి చాటి అన్ని పక్షి జన్మలలో మొదట కోడిగా కావలయునని అట్లైనచో భక్తులను మేల్కొల్పు భాగ్యము కలుగునని ప్రార్థించుటలో భక్తి పరాకాష్ఠ తెలియుచున్నది. ఇట్లే

సీ. గౌతమీ నదిలోన పూతమౌ జలమైన
అభిషేకమునకు నే నర్హుడౌదు
వాసరాపురియందు వ్యాపించు భువినైన
భక్తులు నడువ నాపాపమడగు

గుడిచుట్టు కొండలో గుండునై పడియుండ
నిత్యము నీయొద్ద నేను మనుదు
నీ పూలతోటలో నే పూలమొక్కైన
పూజకై రోజు నే పూలు పూతు.

తే. గీ. గుడికి కట్టిన వస్తువై కూడియుండ
శాశ్వతముగ నీ మ్రోల నే చక్కనుందు
అష్టతీర్థాల వాగ్దేవి అణగియుండ
మనిషికన్నను మిన్నయౌ మాన్యమగను.

ఈ పద్యమున జడపదార్థముగానైన పుట్టి భక్తుల పాదములు సోకిన చాలును అని గుడిని నిర్మించుటకు అవసరమగు సున్నము ఇటుక సిమెంటులా పుట్టిననూ చాలు అనెడి ప్రార్థనలో భక్తిపరాకాష్ఠ సుస్పష్టము కదా!

శ్రీదాసులు దీక్షాబద్ధులుగా శ్రీవిద్యోపాసన చేసి శ్రీవాగ్దేవి అనుగ్రహమును పొంది ఆమె కటాక్షము వలననే ఈ స్తవము ఏర్పడినదని చెప్పుటకు వారి కవితలోని శయ్యను ఒకింత పరిశీలింతము.

''యా పదానాం పరాన్యోన్య మైత్రీ శయ్యేతి కథ్యతే'' అని శయ్యా లక్షణము. ఒకపదము తరువాత

మరియొక పదము తనకు తానుగా వచ్చి చేరవల యును. ఆ పదముకాక ఇంకొక పదము చేరకుండు టను సహించకుండుట శయ్య. 'ఉయ్యాల-జంపాల' ఇచట జంపాల బదులు మరేదున్ననూ సరిపోదు. మనిషి-మాను, మంచి-చెడు. ఇలాంటివి తెలియ వలయును. వీరి పద్యములలో చూతము.

సీ. ఒకకాలు మోకాలు వొయ్యారము గవంచి
లీలగా మలచిన చీలమండ
ఒకకాలు క్రిందుగా నొప్పుగా జార్చగా
పాదాల పారాణి ప్రభలు నిండ
బడిలోన కచ్ఛపిన్ నొడుపుగా నిడుకొంచు
మిన్నగా పన్నాలు మీటుచుండు
తోడుగా చిలుకయు జోడుగా హంసయు
స్వరములన్ సన్నగా బలుకుచుండు

తే.గీ. తెలియొడలుపైన తెల్లని వలువ నిండ
చేతులం గ్రంథమాలల సిరులు పండ
నూరు రేకుల తమ్మిపై గూరుచుండ
చోద్యమొదవును వాగ్దేవి చూచుచుండ

వయ్యారముగా వంచి మలచిన చీలమండ్, పాదాల పారాణి, మిన్నగా పన్నాలు తోడు-జోడు వలువనిండ, సిరులు-పండ, చోద్యము-చూచుచుండ పదములకు గల మైత్రిని రసజ్ఞులు ఆస్వాదించెదరు.

సీ. అరుణార్క కిరణాలు మురిపెంపు మూటలై
పరిసర ప్రాంతాల బరచుచుండు
పచ్చనౌ వృక్షాల ముచ్చటౌ జొంపాలు
ఉయ్యాల జంపాల లూగుచుండు
ప్రీతితో విహగముల్ రెక్కల ల్లార్చుచున్
కిలకిలానాదాలు పలుకుచుండు
మకరందమును గ్రోలి మధుపాలు మత్తెక్కి
పరువంపు ఝంకృతుల్ పాడుచుండు

తే. గీ. పిల్లతెమ్మెరల్ చల్లగా వీచుచుండు
పాయగౌతమి గలగలా పారుచుండు
వాసరాపురి సుందర ప్రకృతి యంత
మునిగి వాగ్దేవి సేవలో మోదమొందు.

మురిపెము-మూట, అరుణకిరణాలు, వృక్షాలు-జొంపాలు, ఉయ్యాల-జంపాల, ఊగుచుండు, కిలాకిలా నాదాలు-పలుకు, మకరందము మధుపాలు

పిల్లతెమ్మరల్‌-వీచుట, గలగలా పారుచుండు, ఇత్యాది పదముల మైత్రి అనుభవైకవేద్యము. ఇటువంటి పద్యములు ఈ స్తవములో కోకొల్లలు. ఇచట గీర సజ్ఞులు కేవలము పరమభక్తులే కాదు కవితాధురీణులే కాదు సరస్వతీదేవి స్తన్యమును చక్కగా ఆస్వాదించిన వారు.

''సంగీతమపి సాహిత్యం సర్స్వత్యా స్తనద్వయం'' అని. సంగీత సాహిత్యములు సరస్వతీ స్తనద్వయము అని భావము. కేవలము సాహిత్య విశారదులే అయి నచో ఒకే స్తన్యమును ఆరగించిన వారగుదురు. సంగీత విశారదులైనపుడే రెండవ, స్తన్యమును ఆస్వాదించిన వారగుదురు. వీరి సంగీతపాండిత్యమును తెలియుటకు సంగీతముపై వీరికున్న అనురాగానికి ఈ రాగాల పరాగాలు చూడుడు.

శా. కామాక్షీ! వలజా, వరాళి, సురటీ, గాంధారి, జంఝూటికా
శ్యామాంగీ, శివరంజనీ బిలహరీ, సావేరి, హంసధ్వనీ
సామా, మోహన, శంకరాభరణ, శ్రీ, సారంగ భాగ్యేశ్వరీ
కామవ్రేరిణి, మధ్యమాది, శహనా, కళ్యాణి రాగప్రియా!

కేవలము రాగాలతో పద్యమును రచించిరి.

ఇక శ్రీవిద్యోపాసన కన్నా ముందు చినవెంకన్న గారు అనుభవించిన స్థితిని ఈ పద్యములో స్పష్టముగా చెప్పియున్నారు. చూడుడు.

మ. గతమందెన్ని దినంబులో గడిచె చొక్కా గూడలేకుండ పా
తతువాలొక్కటి పైన వేసుకొని హస్తంబందు గ్రంథంబుతో
అతిగా మాసిన పంచెతో, తునకలౌ యజ్ఞోపవీతంబుతో
బ్రతుకుంగూర్చిన బాధతో దిరుగ భావాతీత రాజ్యేశ్వరీ!

ఇచట దారిద్ర్యమునకు పరాకాష్ఠగా చూపినది తునకలౌ యజ్ఞోపవీతము. ఇంతకంటె పరాకాష్ఠ దొరకదు. ఇంతేకాదు వీరికి జాతీయ సమగ్రత, సమైక్యము దేశభక్తి కూడా సమపాళ్ళుగా ఉన్నవి అని, వీరిలో ప్రకృతి సంపదను వ్యర్థము చేయుచున్నారను తపన, చేయకూడదదు అను హెచ్చరిక కూడా ఈ కవితలో కనిపించును.

వానలు సోనలై అలుగు వంకలు వాగులు వఙ్జలై భువిని
కానలు గట్టులున్ గడిచి కాలువలై సెలయేరులై అలా
ఆనక పెద్దపెద్దనదులై జలధిం బడిపోవ నాపగల్
చేనుకు బారజేసి పెనుసేద్యము సేయగరాద శారదా!

ఈ పద్యమున జలసంపద ఎంత వ్యర్థమగుచున్నదో హెచ్చరించారు.

కాగితాల మీద అంకెలతో కడుపునిండదని కూడా అధికారులను మందలించుట కూడా కనపడుచున్నది. చూడుడు.

ఆకలి మంటతో మనిషి అన్నము గోరిన కాగితాలపై
కాకుల లెక్కవేసి అధికారులు చల్లగ చర్చసేయ నా
ఆకలి తీరునా ఫలము లబ్బని కాగితమందు గీతలున్
కాకమ లెక్కలున్ ఎవరి కన్నులు నీరులు తుడ్చు శారదా!

భావము స్పష్టము. గుండెలోతులోని బాధకూడా స్పష్టమే. ప్రకృతి కురియు సొగసులు ప్రసాదించు బ్రతుకులు అమ్మ శక్తే అని ఈ పద్యమున స్పష్టముగా చెప్పుచున్నాడు. చూడుడు.

చినుకులు రాలి నేలపయి చిన్నగజిందుచు ద్రుళ్ళి పక్కలన్
బిణుకుచు నెండు బీటలును బుల్గుల జెట్లను జంతు జాలమున్
మనసులు మోడులై పొగులు మాదృశవంచిత మనవాళిలో
మనియెడు హాయి నింపును సుమాలయసుందరి నీదు శక్తిచే.

ఇట్లు శక్తి భక్తి యుక్తిసదుక్తి జాతీయ సమగ్రత, సమైక్యము, దేశభక్తి మొదలగు విషయ గాంభీర్యముతో

అవసరమగుచోట ఉపదేశమును సందేశమును అందించి శ్రీవిద్యోపాసనలోని రహస్యములను కవితారీతులను మాధుర్యమును చూపి అమ్మవారి దయకు పాత్రులైన వారి ప్రాభవమును కనులకు కట్టినట్లు చూపిరి. ఇట్టి స్తవమును అందరూ చదివి శ్రీ అనుగ్రహపాత్రు లయ్యెదరని ఆశించుచున్నాను. ఈ స్తవమునకు భూమిక వ్రాయు అవకాశము ద్వారా మరొకసారి శ్రీవిద్యను మననము చేయు అదృష్టము కలిగించిన శ్రీ వాగ్దేవికి నిత్యసహస్ర ప్రణతులర్పించుచున్నాను.

ఇట్లు

భాగవత విధేయుడు

డా. కందాడై రామానుజాచార్య

ప్రిన్సిపాల్

ఎస్.వి.వి.వి.ఎస్. కళాశాల

ఓల్డ్ ఎయిర్‌పోర్ట్‌రోడ్, బోయిన్‌పల్లి,

సికింద్రాబాద్

## ముందుమాట

మోక్షైకహేతువిద్యా తు శ్రీవిద్యైవ న సంశయః

ప్రతివ్యక్తి ఆనందాన్నే కోరుతాడు. కారణం తన స్వరూపం ఆనందం కావడమే.

కాంతి, పత్రహరితాన్ని ఉత్పత్తి చేస్తోంది. దాని సారాన్నే ప్రకృతి పుష్పంగా, ఫలంగా మార్పులు చెందిస్తోంది. అది ఆహారంగా శరీరంగా మనస్సుగా మార్పు చెందుతోంది. కాంతి, జ్ఞానం, ఆనందం సమాన స్వరూపం గలవే. వీటన్నిటి మధ్య ఉనికి అనేది ఉండనే ఉంది. కావుననే సత్ (ఉనికి) చిత్ (జ్ఞానం) ఆనందమూర్తి పరమాత్మ. సృష్టించే తల్లి రూపమే ఆ పరమాత్మ అనేది శంకరుని అభిభాషణ.

లోకం జడ చేతనామయం. చైతన్య రూపియైన జీవుడు జడాంశతో కలిసి జడ పదార్థాలలోనే చైతన్య రూపమైన ఆనందాన్ని వెతుకుతూ ఉంటాడు.

జడాంశచేత ప్రేరితుడైన జీవి సుఖభోగాలను వస్తు సంగ్రహాన్ని అభిలషిస్తాడు. చేతనాంశచేత ప్రేరితుడై యోగి మోక్షాపేక్ష గలవాడౌతాడు.

భోగేచ్ఛ, మోక్షేచ్ఛ ఈ రెండు ఇచ్ఛలలో భోగేచ్ఛ ఎంత ప్రబలినా మోక్షేచ్ఛను నశింపజేయలేదు. మోక్షేచ్ఛ ప్రబలితే భోగేచ్ఛ నశిస్తుంది. జడం చైతన్యాన్ని ఏమీ చేయలేదు. జడాన్ని చైతన్యం ఏమైనా చేయగలదు.

ఆనందరూపమైన పరమాత్మను గుర్తించే ప్రయత్నమే కాంక్ష.

కాంక్ష యొక్క స్వరూపాన్ని పరిశీలిద్దాం. పరమాత్మ అంతటా నిండినవాడు. ఆ లక్షణాన్ని కలిగిన తాను దాన్ని అభ్యసించడం కోసమే తన ప్రభావాన్ని తన మాట ద్వారా, చేత ద్వారా ఇతరులపై వ్యాపింపజేసి ఆయా వ్యక్తులపై మమతను సాధించి తన పరిధిని పెంచుకోజూస్తున్నాడు. అలా పరిధిని బాగా వ్యాపింప జేసుకొన్న మహాత్ములు వసుధైక కుటుంబీకులౌతున్నారు. ఈ కోణంలో ఆలోచిస్తే ఏ వ్యక్తి ఏ పనిచేసినా దానికి గల కారణం మోక్షేచ్ఛ యొక్క ప్రతిరూపమే. కాని అందుకోసమని తెలియకుండా చేస్తున్నాడు - అదే అజ్ఞానం. భోగేచ్ఛగా ఆరంభమైన ఆధ్యాత్మిక చింతన మోక్షేచ్ఛగా ఆకృతి దాల్చడమే మానవ జీవన పరమార్థం.

అన్ని కోరికలనూ తీర్చుకోవడానికి సుఖానుభూతికి జ్యోతిశ్శాస్త్ర పరంగా చతుర్థ స్థానం మూలం. అందులోనే విద్య, వాహనం, గృహం, ఆహారం ఉన్నాయి. వాటినందించే ''అమ్మ'' గూడా ఉంది. అమ్మ అన్ని సుఖాలకూ ఆలవాలమనే భావన నుండే అమ్మవారి పూజ రూపుదిద్దుకుంది. వానిలో విద్య, ఆహార, గృహ, వాహనాదులను సమకూర్చు కోవడానికి తగిన ప్రజ్ఞ నందిస్తోంది.

ఆకాశంలో అభిజన్నక్షత్రం ఒకటిగా కన్పిస్తోంది. కాని దానిలో 4 చుక్కలున్నాయి. ఆ నాల్గు చుక్కలు రెండు జంటలుగా ఉన్నాయి. ఆ రెండుజంటల గరిమనాభి శూన్య ప్రదేశంలో ఉంది. ఆ రెండు జంటలు శివపార్వతులకు, లక్ష్మీనారాయణులకు ప్రతీకలైతే - మధ్యశూన్యంలో ఉన్న గరిమనాభి నాభికమలం నుండి ఉద్భవించిన బ్రహ్మకు ప్రతీక. ఆ ప్రదేశం నుండి వెలువడే శబ్దతరంగాలే సృష్ట్యాదిలో జీవోత్పత్తికి హేతువు అయిందని వైజ్ఞానికుల భావన.

''భూరితి భువ మసృజత'' అనేది వేదవాక్కు. వాగర్థాలు నిత్యసంపృక్తాలని కాళిదాసు కమనీయ కవిత.

సృష్టికి మూలకారణమైన శబ్దస్వరూపిణి వాగ్దేవి తత్వసంబంధంగా ఆలోచిస్తే ''ఐశ్వర్య కారకులైన ఈశ్వరుడు (ఐశ్వర్యం ఈశ్వరా దిచ్ఛేత్) లక్ష్మి ఒకేతత్వం గలవారు. లయ కారకుడు శివుడు. సకల యుద్ధాలు లయాత్మకాలే. ఆ యుద్ధాలకు మూలం ధనమే కావడం వలన లక్ష్మి అష్టోత్తరములో ఆమె ''క్రోధసంభవ'' అయింది.

లలిత - రాముడుగా, శ్యామల - కృష్ణుడుగా అవతరించారనే మాట, ''పార్వతి నారాయణ సహోదరి'' అనుట గమనిస్తే - పార్వతి నలుపు, విష్ణువు నలుపు

అనేవి పరిశీలిస్తే - పార్వతి విష్ణువు ఒకే తత్వం గలవారని అర్థం అవుతుంది. లక్ష్మి విష్ణు వక్షస్థలాలయకావడం పార్వతి అర్ధనారీశ్వరి కావడం చూస్తే నాలుగు నామాలే గాని ఆ రెండు జంటలూ అభిజిత్తులోని రెండు జంటలనీ వాటి గరిమనాభి నాభికమల జాతుడైన బ్రహ్మ అనీ అభిజిన్నక్షత్రం త్రిమూర్త్యాత్మకం త్రిశక్త్యాత్మకమనీ అర్థం అవుతుంది.

సృష్టికి మూలమైన ఆ శబ్దశక్తి స్వరూపిణి ఈ ''క్వణత్కాంచి''లో దర్శనమిస్తోంది. జ్ఞానానంద మయమైన ఆ తల్లి ప్రశస్తిని, వాసరక్షేత్ర ప్రశస్తిని, పూజామహిమను వర్ణించడంతోబాటు దేవీ ఆంతర్యాన్ని వ్యక్తీకరించడం అపరిమితానందప్రదం.

''వదవదా! వాగ్వాదినీ! భారతీ!'' వంటి మంత్రాక్షరాలు గల ''క్వణత్కాంచి'' అక్షరయశస్సును, అక్షరత్వాన్ని కలిగి వ్యాపిస్తుంది అనడంలో సంశయం లేదు.

''మాటలాడగల ''చిలుక''నే చేతదాల్చినది ఆ తల్లి''

''మంచి చెడ్డలను (పాలు, నీరు) వేరుచేసే వివేకరూపమైన హంస వాహనంగా గలది.''

''పంకజమైనా పద్మం పూజనీయమని అలాగే వాగ్దేవి కరుణిస్తే ఏ జననమైనా సర్వారాధ్య మౌతుందని''

వస్తుతత్వాన్ని ఈ ''క్వణత్కాంచి'' వివరిస్తోంది.

వాగ్దేవిని 119 వాక్సుమాలతో అర్చించి ''శుభ గత్వము గల్గిన మాట'' లందించిన శ్రీ మాధవపెద్ది చినవెంకన్నగారు ధన్యజీవి.

వీరు ఉపన్యాసంలోను, రాగవిన్యాసంలోను, మంత్ర న్యాసంలోను, జ్యోతిషాది శాస్త్ర విన్యాసంలోను ఆరితేరిన ఘనులని, ఘనకీర్తి నార్జించిన విద్వన్మణులనీ, బహుశ్రుతులనీ జగమెరిగిన వారనీ జగమెరిగిన మాట నిజం. వారు నన్ను జగాని కెరుకపరచడం కోసం ఈ ముందుమాట వ్రాయమన్నారు. ఆనందం వికసిస్తుంది. ఈ ''క్వణత్కాంచి'' పఠనం అందరికీ ఆనందదాయక మౌతుందని భావిస్తూ.....

మీ

డా. సి.వి.బి. సుబ్రహ్మణ్యం
M.A. Tel, M.A. Skt.,
Ph.D.

Head of the Dept. of Astrology,
Potti Sriramulu Telugu University,
Public Gardens, Hyderabad.

# కృణత్కాంచి

## (శ్రీవాగ్దేవీ స్తవము)

ఓం శ్రీ వాగ్దేవతాయై నమః

కవితాంశక్రమము

1. ఇష్టదేవతా ప్రార్థన
2. సైకత విగ్రహావిష్కారము (మంత్రబీజాక్షర సమన్వితం)
3. దేవీప్రశస్తి - అలంకార వర్ణనం (సీ. బ్రాహ్మీ ముహూర్తాన కం. గంధము పన్నీరు పసుపు)
4. వాసర ప్రశస్తి (సీ. అరుణార్క కిరణాలు, శా. చిత్రంబేమిటి బ్రహ్మరాణి, ఉ. ఉత్పల పత్రనేత్ర)
5. ప్రపత్తి - ఆత్మార్పణం
6. దేవీ పూజామహిమ
7. దేవీ ఆంతర్య వర్ణన (Symbolism) తత్త్వము
8. దేవీ సర్వాన్తర్యామిత్వము - అష్టాదశ పీఠాలు, నవదుర్గలు.
9. పురాణ ప్రమాణము - చరిత్ర ప్రమాణము (శా. దత్తాత్రేయ నృసింహ భారతి)
10. ఇతరములు (వేడుకోలు)
11. విన్నపము
12. ముగింపు



## ఇష్టదేవతా ప్రార్థన

శ్లో. శ్రీవాగ్దేవీం మహాకాళీం
మహాలక్ష్మీం సరస్వతీమ్ ।
త్రిశక్తిరూపిణీ మంబాం
దుర్గాం చండీం నమామ్యహమ్ ॥ 1

కం. వెలివలిపెంబును, జందెము,
నలుచేతు లొనర, నొరుపలు, నగుమొగము వెసఁగ,
తెలిమెయిగల వెనకయ్యను
బలుటడ్డు తొలగ దలంతు – పఱచెడు వానిఁ. 2

కం. తమసుల రాశిని సూర్యుడు
నెమకించు నటుల గణేశుని స్తవనముతో
సుమసమపదముల మననము
గమకించుచు విఘ్నమెల్ల గడపును భువిలో! 3

కం. వాగీశాది సుమనసులు
వేగంబ పనులు ముగింప వేగిరపడుచుఁ
ఏ గీరసజ్ఞ బూజలు
సాగింతు రతని నుతింతు సదమలభక్తిఁ! 4



కం. వరదా! వాణీ! సరస్వతి!
సరసిజ ముఖి! నలువరాణి! చదువుల కొలికై
వరకామరూపిణీ! నిను
నిరతము నే గొలుతు నమ్మ నిశ్చలభక్తిన్! 5

కం. శ్రీవాణి గిరిజాకృతి
గోవింద విధాతృ భవుల గూడిన మూర్తిన్!
శ్రీవాగ్దేవిని గొలిచెద
నావాక్కుల నాట్యమాడ నవరసఫణితిన్! 6

కం. జ్ఞానానందుని, హయముఖు,
నానావిద్యలు కళలకు నాయకు, దేవున్
మానితమంత్రాధీశుని,
ధ్యానము చేతున్ స్ఫటికపు ధవళాకారున్! 7

తే. గీ. సర్వలోకాలకు గురువు సత్యపటిమ!
భిషజుడు భవరోగాలకు విషముమ్రింగి!
నిధియు సర్వవిద్యలకికు నిశ్చల మతి!
దక్షిణామూర్తి దలతు మేధస్సు కొఱకు!.. 8

కం. రాముని నెదలో నిల్పును
నామము కీర్తన సలుపుచు నర్తన సేయున్!



తామస గుణమును బాపును
బాముల బోగొట్టు నట్టి పావని దలతుఁ!. 9

సీ. శ్రీ జానకీదేవి చింతలు బాపిన
వాతాత్మజున కివే వందనములు,
శ్రీరామసుగ్రీవ చిరమైత్రి గూర్చిన
మారుతి కివె మా నమశ్శతములు,
లంకాపురంబు వాలాగ్నితో గాల్చిన
రుద్రాంశభవునకు భద్రవినతి,
సంజీవి గొనితెచ్చి సౌమిత్రి గాచిన
ఆంజనేయున కిదే అంజలితతి!

తే. గీ. ఎచట రామకీర్తన యగు నింపుమీర
నచట- ఆంజనేయుడు పాడు నంజలించి,
కనుల నానందబాష్పాలు గార, నట్టి
మారుతి ననవరతము నమస్కరింతు! 10

కం. గురువే బ్రహ్మయు, హరియును
గురువే, గురువే భవుడును, గురువే జగముఁ!
గురువే సాక్షాద్బ్రహ్మము,
గురు-నే నిరతము గొలిచెద గురుపదభక్తిఁ! 11



## సైకత విగ్రహావిష్కారము

ఉ. భారతయుద్ధ మైన తరువాతను వ్యాసుడు మానసంబున-
న్నారట లేని ఆరటము బొందుచు తీర్థములందు మున్గుచున్,
నేరుగ వింధ్యపర్వతము నెమ్మది దాటుచు దక్షిణంబునన్
బారెడు గోదవారి నది పాయను గౌతమి గాంచె నొప్పుగన్! 12

ఉ. అచ్చట నొత్తుగా బెరిగి, అద్భుతమైన, మనోహరంబునౌ
పచ్చని పంటలం గనుచు, పారెడు గౌతమి సోయగంబులన్
మెచ్చుచు, బుద్ధిలో బరిణమించిన నారట హాయిబొందుచున్,
అచ్చట గొండలో ఒక గుహన్ దన వాసము చేసె ముచ్చటన్!13

కం. వ్యాసుడు నివసించుటచే
వ్యాసర యనగా బదపడి వాసరయనగా
భాసుర మయ్యెను నచ్చటు
బాసర యనగా నిపుడది ప్రచురంబయ్యెన్! 14

సీ. నిర్మల గౌతమీ నీరం పుటలలలో
బ్రాహ్మీవలహూర్తాన వచ్చి మునిగి,
అరుణోదయముదాక ప్రాణాల నాయామ
మొనరించి యొక్కట మనసు నిలిపి,
తొలిసంధ్య కిరణాలు తలపైన బడకుండ
నర్ఘ్యప్రదానంబు నాచరించి,



అపరాహ్ణ మగుదాక జపియించి గాయత్రి
షడ్చక్రకుండలిని సంతరించి

తే. గీ. పిదప షోడశీ మంత్రంబు పెద్దతడవు
నుచ్చరించుచు తీర్థంబు నూలు కొలిపి,
తటిని నిసుకను దోసిళ్ళ దడుపుకొనుచు
కుప్పవోసెను గుహలోన నొప్పుమీర!. 15

మ. అటు లా వ్యాసుడు పోయగా నిసుక నింతంతై, మరింతంత యై
పటిమన్ దోసిళు లెన్నియో పెరిగి, శ్రీవాణీ భవాన్యాకృతిన్,
చటులామోదిత షోడశీ భరిత సాక్షాత్కార మన్నట్లుగా
వటుకావిగ్రహ రూపమై పరగె శ్రీవాః పూర్ణ దార్ఢ్యంబునన్! 16

శా. శ్రీమంతంబయి, సర్వశక్తియుతమై, శృంగార సౌందర్యమై,
ధీమంతంబయి, హ్రీయుతంబు, వదనోద్దీపాంతరాక్లిష్టమై,
కామేశాధికృతంబునై, సకలమై, కైవల్య పూరంబునై
వామాకారము నొప్పుచుండ వెలసెన్, వాగ్భావ కూటంబునన్! 17

కం. ఓంకారము రూపమనగ
హ్రీంకారము శక్తియంచు నెఱిగిన వారల్
ధీంకారము బీజ మనుచు
శ్రీంకారము చేర్చి నిన్ను సేవింతు రిలన్! 18



## దేవీప్రశస్తి-అలంకారము

సీ. బ్రాహ్మి ముహూర్తాన బ్రాహ్మభిషేకాన
నలదిన బండారు వలిచి తీసి,
పుష్కరిణీ తీర్థపుణ్యాహవచనాన
చందన హరితాలచర్చ సేసి,
పట్టు పీతాంబర వస్త్రయుగ్మము గట్టి
యజ్ఞోపవీతంబు నమర జేసి,
వైదికాగమశాస్త్ర బ్రాహ్మణోత్తము లెల్ల
రర్చనారాధన లాచరించి,

తే. గీ. సర్వభూషణాలంకృతుల్ సంతరించి
కుసుమహారాలు నిలువునా కూర్చి పేర్చి
ముగ్ధమోహన సుందర మూర్తి నింప
దివ్యమంగళ ''వాగ్దేవి'' తేజరిల్లు! 19

కం. గంధము పన్నీరు పసువు
బాంధవ మేర్పడ సమమగు పాళ్ళను మెత్తఁ
బంధుర రూపము వెలయును
సిందుజ భారతి గిరిజల శ్రీముఖి మూర్తిఁ! 20

ఉ. విద్దెలరాణి! నేను నిను వేడెద నామది నుండుమంచు, నా
సుద్దులు సాహితీ జగతి శోభిల జేయుము నిత్యమంచు, ఓ



ముద్దులు మూటగట్టినటు ముచ్చట గొల్పెడు ముద్దరాల! నీ
యొద్దనె వాసర్ణ పదము లొద్దిక గొల్వగ నిమ్మటంచునర్ణ! 21

ఉ. వీణియ చేతబూని, నునుప్రేళుల తంత్రులు మీటి, వేదని
క్వాణము దిక్కులం బఱపి, ప్రాణుల దేహము జీవనాడులం-
దాణవచేతనాగతిని-ఆగక సాగగనిచ్చు దేవి-గై
ర్వాణి హృదంతరాళమున వాక్కులు శోభిలజేయు గావుతర్ణ!. 22

చం. ఉదయము నిన్నుజూడ మది నూహల కందని బాల రూపునర్ణ,
పదపడి మధ్యవేళ గన భాసుర మౌ యువతీ వయస్సునర్ణ,
ముదమున సంధ్యవేళ గన మోదము గూర్చెడు ప్రౌఢమూర్తిగా
ముదితరొ! నాకు గన్పడగ ముచ్చట నచ్చెరు వయ్యె శారదా!. 23

సీ. ప్రాభాతసంధ్యలో పంచాస్య గాయత్రి
బ్రాహ్మిగా తర్పణార్ఘ్యయగు నిమ్మజి!
మాధ్యాహ్నికంబులో మాహేశి సావిత్రి
రౌద్రిగా తర్పణార్ఘ్యయగు నిమ్మజి!
సాయంపు వైష్ణవి సరస సరస్వతి
హంసగా తర్పణార్ఘ్యయగు నిమ్మజి!
ముప్ప్రొద్దు సంధ్యలో మువ్వంపు శ్రీదేవి
మూడుగుణములకు ముద్దుగుమ్మ!

✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣

తే. గీ. సత్వరజములు తమమును సంతరించి
ప్రకృతి సృజియించి, పోషించి, ప్రళయపరచు
పరయు, పశ్యంతి, మధ్యమ, వైఖరులను
ప్రణవరూపిణి "వాగ్దేవి" బ్రణుతి సేతు! 24

సీ. కాశ్మీర దేశాన కమనీయరూపాన
శ్రీసరస్వతి యనర్ఘ శ్వేతగాత్రి!
వాసరాపురమందు భాసురం బైనట్టి
జ్ఞానసరస్వతి జ్ఞానదాత్రి!
శృంగేరిపీఠాన శ్రీశంకరారాధ్య
శక్తిత్రయాత్మిక శారదాంబ!
రాగిదొన్నెలమధ్య రమణీయ ప్రకృతిలో
నిలుచున్న "వాగ్దేవి" నీలవేణి!

ఆ. వె. నాల్గు నంశలిందు వెల్గొందు చుండగా
భరతభువిని వెలసె చరిత పూత!
కొలుచువారి కిలను కొంగుబంగారమై
వరలు దేవి గొలుతు వాణినెపుడు! 25

సీ. వాసరాశిఖరాన వసియించు "వాగ్దేవి"
ఆయురారోగ్యంబు లందజేయు!



అష్టతీర్థములయం దాచమించెడు బ్రాహ్మి
జ్ఞానసరస్వతి జ్ఞాన మొసగు!
గౌతమీజల తరంగాలలో నోలాడు
వేదాల శ్రీమాత విద్య లిడును!
నిగమాంతసీమలో నృత్య మాడెడు కాంత
మూఢత్వమును బాపి మోక్షమిచ్చు!

తే. గీ. శ్రీమహాకాళి లక్షి విరించిరాణి
యగుచు ముగురమ్మలకు నమ్మ ఆదిశక్తి
పరయు పశ్యంతి మధ్యమ వైఖరులను
నాల్గు వాక్కులబఱగి మనలను బ్రోచు! 26

సీ. సకల వేదాలలో సమరసప్రణవంబు
స్మృతులలో శోభిల్లు ఋషుల బోధ!
ఉపనిషదంతస్థ తపనార్థ తత్త్వంబు-
అష్టాదశపురాణ సార్థతనువు!
పదునాల్గు శాస్త్రాల వాక్యార్థ సారంబు
సాహిత్యకావ్యాత్మ సరసచర్చ!
ఇతిహాసవాఙ్మయ ప్రతిపాదితార్థంబు
వామకేశ్వర తంత్ర వాక్యమూర్తి!

✤ ✤ ✤ ✤ ✤ ✤ ✤ ✤ ✤ ✤ ✤ ✤ ✤ ✤ ✤ ✤ ✤ ✤ ✤ ✤ ✤ ✤ ✤ ✤ ✤

తే. గీ. షోడశీమంత్ర శ్రీచక్ర శోభితాంగి!
కామరాజ వాగ్భవశక్తినామ కూట!
దేహషట్చక్ర వేధాధివాహ! వాణి!
సరస "వాగ్దేవి" – సంపూర్ణవరము విడుత!. 27

సీ. వరముద్ర నొకచేత భద్రంబుగా బట్టి
వరదాన మొసగుదా భక్తతతికి,
త్రాణముద్ర నొక కరంబులో హవణించి
అభయంబు "వాగ్దేవి" ఆర్తుల కిడు,
జపమాల నొకకేల చక్కగా గీలించి,
విస్తరించును మంత్రబీజరాజి,
పుస్తకం బొక హస్తపుటములో హత్తించి,
వల్లెవేయును వేదపన్నములను,

తే. గీ. చంద్రలేఖను సిగలోన జక్కనొత్తు
వెన్నెలను నిన్ను గొలువని విజ్ఞులైన
తేనె, పాలును, ద్రాక్షలు సోనలూరు
మధురకవితలు వ్రాతురె మహిని నెలమి! 28

సీ. బంగారు మొలనూలు పలుమార్లు నినదించి
దర్శించుభక్తులం దనుపుచుండు,



సంగీత సాహిత్య సదనాలు పాలిండ్లు
మధురామృతంబు ముమ్మాటికొసగు,
సన్ననౌ లేగాను చిన్నగా వంగుచు
పూజించువారలఁ బ్రోచుచుండు,
శరదిందుచంద్రికా సందీప్త వదనంబు
శరణార్థి కోటిని సాకుచుండు,
తే.గీ. ధనువు, బాణాలు, పాశంబు, సృణియుదాల్చి
ముజ్జగాలను గాపాడు ముద్దరాలు!
చూడపురుషుడా యన్నట్లు చోద్యమొదవు
ఎపుడు ముందుండు ''వాగ్దేవి!'' ఏకవీర! 29

సీ. వెన్నెల కిరణాలు వెలుగొందు నగుమోము
భక్తకోటికి హాయి పంచిపెట్టు,
చెంపకు చేరడేసి పుటమౌ కనుదోయి
కురిపించు జనులపై కూర్మివాన!
సంపెంగపూవంటి చక్కనౌ నునుముక్కు
ఋజుమార్గవర్తనం బెఱుకపరచు
జాబిల్లివంటి విశాలమౌ ఫాలంబు
ఆర్తజనుల కభయంబు నొసగు,



తే. గీ. మల్లెమొగ్గల కీడగు తెల్లని పలు
వరుస విశ్వమంతయు శాంతి వరలజేయు
సకల సద్గుణసంపన్న శారదాంబ
రమ్యసాకార "వాగ్దేవి" బ్రాహ్మిగొలుతు! 30

సీ. పగడాల ప్రభలతో భాసించు నొడలుతో
లక్ష్మిప్రదాత్రియౌ లక్ష్మియగుచు,
జాబిల్లి వెలిచాయ చక్కనౌ మెయితోడ
సకల విద్యాదాత్రి శారదౌచు,
చీకటి గానుగు చెట్టులా నల్లనౌ
కాలశత్రువిఘాతి కాళియౌచు,
మూడుమూర్తుల నొప్పు మువ్వంపు "వాగ్దేవి"
త్రిగుణాత్మశక్తియై తేజరిల్లు!

ఆ. వె. లక్ష్మి, వాణి, కాళిలక్షణంబుల తోడ
మూడుగుణములొప్పు మూర్తి యగుచు,
వాణిరూపు దాల్చి వాసరా పురియందు,
వరలుచున్న దేవి బ్రస్తుతింతు! 31

సీ. ఒకకాలు మోకాలు నొయ్యారముగ వంచి
లీలగా మడిచిన చీలమండ,



ఒకకాలు క్రిందుగా నొప్పుగా జార్చగా
పాదాల పారాణి ప్రభలు నిండ,
ఒడిలోన కచ్ఛపిఁ నొడుపుగా నిడుకొంచు
మిన్నగా పన్నము లీ్మటుచుండ,
తోడుగా చిలుకయు, జోడుగా హంసయు,
స్వరములఁ సన్నగా బలుచుచుండ,
తే. గీ. తెలియొడలు పైన దెల్లని వలువ నిండ,
చేతులం గ్రంథమాలల సిరులు పండ,
నూరు రేకుల తమ్మిపై గూరుచుండ,
చోద్య మొదవును "వాగ్దేవి" చూచుచుండ! 32

కం. చందురు సమమగు మొగమును
చందురు సగమును తురిమిన సరసపు సిగయుఁ
చందురు వెలుగుల మెయిగల
చందురు సకియును మనసున సతతము దలతుఁ! 33

కం. మాతవు, ముల్లోకాలకు,
పూతవు, జీవనసముద్రపోతవు, జయసం
కేతవు, మధురసపదసం
గీతవు, మంగళ గుణగణగీతవు వాణీ! 34



## వాసర ప్రశస్తి

సీ. అరుణార్కకిరణాలు మురిపెంపు మూటలై,
పరిసర ప్రాంతాల బరచుచుండు,
పచ్చనౌ వృక్షాల ముచ్చటౌ జొంపాలు
ఉయ్యాల జంపాల లూగుచుండు,
ప్రీతితో విహగముల్ రెక్కలల్లార్చుచున్
కిలకిలా నాదాలు పలుకుచుండు,
మకరందమును గ్రోలి మధుపాలు మత్తెక్కి
పరువంపు ఝుంకృతుల్ పాడుచుండు,

తే. గీ. పిల్ల తెమ్మెరల్ చల్లగా వీచుచుండు,
పాయగౌతమి గలగలా పారుచుండు,
వాసరాపురి సుందర ప్రకృతియంత
మునిగి ''వాగ్దేవి'' సేవలో మోదమొందు!. 35

శా. చిత్రంబేమిటి బ్రహ్మరాణి! కనగా చిత్తంబులో గోరి, నీ
యాత్రాప్రాంతము వాసరా పురమునన్ యాత్రార్థమేతేరగా
నేత్రానందముబొంది, డెందమలరన్ నీసేవ బాల్గొన్నచో
సత్రేష్ఠ్యాదిఫలంబు గల్గు నిచటన్ సన్మంత్ర చింతామణీ! 36

ఉ. ఉత్పలనేత్ర! పురి యుత్సవ సంభ్రమ మేమి తెల్పుదున్
తత్పరబుద్ధితోడ జనతండము తండము లేగుదెంచి, నీ


కుత్పలపుష్పమాలికల నుంతురు శారదరాత్రులన్నియుః
త్పత్పరిమాణమంత బహు భక్తియు శ్రద్ధయు తేజరిల్లగః! 37

కం. అందపు గడలికి తీరము
నిందుల గలదని సరసుల కింపుగ దెలుపః
సందీప్తి దీపగృహ మను
పొందుగ వాసరపురమున బోడమితా వాణీ! 38

ప్రపత్తి

కం. అమ్మా! భవాని! దయగను
మమ్మా దాసుడను నీకు నను నెవ డతనిః
రమ్మా కడ కని యిడుదువు
లెమ్మా హరిహర విరించు లిమ్మను పదవిః! 39

కం. ఎన్నో దినముల నుండియు
నిన్నాప్యాయమున జూడ నే వచ్చుటకై
ఎన్నో విధముల గడిగితి
అన్నా! నా కోర్కె యింక నగునో! కాదో! 40

సీ. మల్లెపూవునయి నీ చల్లని చరణాల
రాలిపోయిన నేను చాలునమ్మ!
ఒకకేల జపమాల నొప్పుగా నౌదునా
అంతకంటెను నేమి ఆశలేదు!



నీరజంబులవంటి నీరెండు కరముల౯
వీణనై పాడుచో వేరువలదు!
వటుకనై, చిలుకనై, పద్మమై, వేదమై,
సేవించుచున్నచో చింతలేదు!

ఆ.వె. ఎన్ని జన్మలెత్త నేమి ఓ ''వాగ్దేవి''
జన్మ పిదప చావు జన్మ తప్ప-
మనిషికంటె నిత్యమైనట్టి నీవస్తు
తతియె మిన్నయనుచు దలతు నమ్మ! 41

సీ. కోడినై నీ భక్తకోటులన్ మేల్కొల్పి
పూజింప రండంచు బోధసేతు,
కోయంచు నెలుగెత్తి కూయుచు౯ గీర్తింతు
గుణగణముల నెల్ల కోకిలౌచు,
తొలిప్రొద్దు వెలయంగ కిలకిలా నాదాల
పొగడుదు౯ మహిమల౯ పులుగునౌచు,
నీయందచందాలు నిరుపమాన మటంచు
అందఱి కెరిగించు హంసనౌచు,

ఆ.వె. మనిషి జన్మకంటె మహిలోన ''వాగ్దేవి''
పక్షి జన్మమిగుల భవ్యమగును,
దేవి సేవలో దినమంత లీనమౌ-
స్వార్థపరుడు మనిషి వంచకుండు! 42



సీ. గౌతమీనదిలోన పూతమౌ జలమైన
అభిషేకమునకు నే నర్హుడౌదు!
వాసరాపురియందు వ్యాపించుభువినైన
భక్తులు నడువ నాపాప మడగు!
గుడిచుట్టు కొండలో గుండునై పడియుండ
నిత్యము, నీయొద్ద నేను మనుదు!
నీపూలతోటలో నేపూలమొక్కైన
పూజకై రోజు నేపూలుపూతు!

తే. గీ. గుడికి కట్టిన వస్తువై కూడియుండ-
శాశ్వతముగ నీమ్రోల నే జక్కనుందు!
అష్టతీర్థాల ''వాగ్దేవి'' అణగియుండ-
మనిషికన్నను మిన్నయౌ మాన్యమగును!. 43

దేవీపూజామహిమ

సీ. ప్రాచేతసుండైన వాల్మీకి దేవర్షి
రామాయణం బెట్లు వ్రాయగల్గె!
వ్యాసర్షి వేదవిభాగము చేసి - పు
రాణాల నేరీతి రచన సేసె!
పాణిని వరరుచి వరపతంజలి ముని-
త్రయమెట్లు శబ్దశాస్త్రము రచించె!

✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣

అన్యు లేరీతి భాష్యాలు శాస్త్రాలు కా-
వ్యాలంకృతులు వ్రాసి రందముగను!

తే. గీ. త్రివిధ మతకర్త లేరీతి తీర్థులైరి!
భాషలన్నియు నెబ్బంగి వరలు నమ్మ!
ఎటుల పండితులు రచింతు రింపుమీర!
పరగ 'వాగ్దేవి'' నీశక్తి వలన గాదె! 44

మ. కరుణాదృష్టులు చంద్రికాసఖులు సాక్షాత్కార మొందింపగా
తరుణాయుః పరిమాణమందు మన వేదాంతాది సాహిత్యముల్
పరిపూర్ణంబుగ చిల్కి పంచుటను సర్వాంగీణ సారాంశముల్
గురుదేవోత్తముడయ్యె శంకరుడు లోకోద్ధారకీ! నీ కృపన్! 45

చం. చదువరి నీదు శక్తి విని చయ్యన వాసర కేగుదెంచి, నీ
సదమల పాదయుగ్మమును శ్రద్ధగ మ్రొక్కుచు బూజ సల్పియున్,
చదివి పరీక్షలందు ఘనసత్ఫలితాలను బొందుచుండగా
హృదయమునందు శంకిలగ నేటికి నీ మహిమన్ సరస్వతీ! 46

చం. స్తుమతులైన ధీమతులు దూరమునుండియు భక్తి శ్రద్ధలన్
సతమతమౌచు, చూచుటకు సాదరబుద్ధిని నేగుదేరగా
సతతము ప్రేమతోడ సుఖసంయుత దర్శన తీర్థసాదముల్
కుతుకము దీరగా పసుపుకుంకుమ లిత్తువు శ్రీసరస్వతీ! 47



మ. కవితామూర్తులు సాహితీవిభు లలంకారాది సామగ్రితో
కవితల్ వ్రాయగ నూహసేయ మది నీకంజాత పాదంబులన్
సవిశేషంబుగ మ్రొక్కినం గద రసాసారాప్తగంగా ఝరుల్
ప్రవహించున్ గిరిశృంగముల్ దిగుచు సంప్రాపింప రత్నాకరున్! 48

మ. అవధానం బన నేమి, ఆశుకవనంబన్నన్, ప్రబంధాలనన్
సవిశేషంబుగ గద్యపద్య కవితాశాస్త్రాద్యలంకారముల్,
భువి వేదోపనిషత్పురాణ నిచయంబుల్, తన్నిఘంట్వాదులున్
భవుకంబైన సమస్త వాఙ్మయము వాగ్భావంబు శ్రీభారతీ! 49

కం. అష్టావధాన మొనరుప
శిష్టుల్ మదినీ చరణకుశేశయములు మున్
దుష్టిం ధ్యానము చేసిన
నిష్టా పూర్తిగ మధుర ధునింబలె సాగున్! 50

శా. సంగీతంబును సాధనం బొనరుపన్ సారించి తంబూర, నీ
భృంగారాస్పద రత్న పీఠగతముల్ పెంపారు పాదంబులన్,
శృంగారాంచిత శబ్ద పూర్ణగతులన్ చిత్రించి వర్ణించగా
సాంగోపాంగము తోడ సాగు స్వరముల్ సారిగమాపాధనుల్! 51

కం. వాద్యము నేర్చిన వారలు
సద్యః స్ఫూర్తిని నొకపరి సంకీర్తనతో



వాద్యము మ్రోయింపగ నిట
విద్యాసంపద లిడెదవు వీణాపాణీ! 52

కం. నర్తన నేర్చిన పిమ్మట
నర్తకులుం దమ ప్రదర్శ నము లిచ్చుటకుఀ-
నర్తించగ నీ ముందఱ
నర్తింతువు చూచువారి నయనము లందుఀ! 53

శా. సంతానంబును గోరి దంపతులు నిష్ఠన్ గౌతమీ స్నానముఀ
సంతోషంబున జేసి వచ్చి గుడికిఀ సవ్యంబుగా దిర్గుచుఀ,
స్వాంతంబందున నీదుమంత్ర మనుచో స్వప్నాన గన్పట్టి - నీ
వెంతో సంతసమంది యిత్తువటగా నిమ్మైన సంతానముఀ! 54

శా. ఎన్నో యేళుల నుండి చూసి వరులఀ, ఎన్నోన్నో పర్యాయముల్
చిన్నా పెద్దని లేక, తిర్గి, పితరుల్ చింతించి కట్నాలనఀ
అన్నా! మాకిక జేతగాదనుచు నీ కర్పించి కూతుంద్ర, వే
విన్నే వేడగ పెండ్లి సేతువటగా నీరేజ పత్రేక్షణా! 55

శా. ఉద్యోగంబున వృద్ధిగోరు జనులు న్నుత్కంఠతో వచ్చి, నీ
సద్య స్స్ఫూరక పాదతామరసముల్ సవ్యంబుగా గొల్చగా
పాద్యంబు ల్నదినుండి తెచ్చి, వనిలో పత్రాలు పుష్పంబులుఀ
ఆద్యంతంబుగ పూజసేయ నుచితంబౌ వృద్ధి నందింతువే! 56



శా. ఆరోగ్యంబును గోరి రోగి కడకున్-ఆరాధనా బుద్ధితో
వేరే చింతలు మాని నీపయి నెవన్ విశ్వాసమున్నిల్పి, నీ
నీరోద్భూత పందంబులన్ మనసులో నిత్యంబు పూజించుచున్
దా-రోజూ నదిలో మునింగి, గుడి-నిన్ దర్శింప, నీరోగియౌ! 57

చం. అరువదినాల్గు విద్యలకును నాదిమదేవత నీవ యౌట-నీ
గరువము స్వర్గమందుననె గా దిట మధ్యమలోకమందు, నా
వరుసను సర్వలోకముల వర్ధిలుచున్నది వాణి! మాపయిన్
మురిపముతోడ నాల్గిటిని ముఖ్యములౌ కళలంద జేయుమా! 58

కం. కాపుర మందున కలతలు
రేపిన కర్మకు వగచుచు, రేయింబవలున్
దీపము నీకడ బెట్టిన
తాపము నణచుచు కలిపెదు దారాపతులన్! 59

కం. లక్షల వ్యాపారములో
ప్రక్షయనష్టము గలిగిన వ్యాపారు లిటన్-
అక్షయపూజలు సలిపిన,
తక్షణమే లాభము లిడి తనుపుదు కోట్లన్! 60



## దేవీతత్త్వము

మ. కరమందా సకలాక్షమాల జపకాంక్షన్ దాల్చి, చిత్తంబులో
నిరవద్యంబగు భాషగూర్చి సతమున్ నీచేయు యోగంబిలన్
స్థిరతన్ ధ్యానము సేయుటం దెలుపు నీ చింతామణీ మంత్రమున్
వరముల్ మాకిడు నిత్యమున్ వదవదా! వాగ్వాదినీ! భారతీ! 61

ఉ. హస్తము నందు వేదమును నాదర బుద్ధిని దాల్చి, పన్నముల్
ప్రస్తుతి వల్లె వేయుచును, రక్షిత ధర్మము రక్షసేయు సం
శస్తిని దెల్పి, మానవుల చారు తరంబగు ధర్మమార్గమున్
స్వస్తివచస్సులం జొనిపి, జాగృతి సేతువు శ్రీ సరస్వతీ! 62

చం. చిలుకను చేత దాల్చి, తమి జెప్పిన మాటలు ముద్దుముద్దుగా
పలుకుచు నప్పుచెప్పు, నొకపట్టున నేర్పిన, మాటెకాదు, పా
టల నటు పాడగల్గు నని డంబర మించుక లేక సత్యమున్
దెలుపుచునుంటి వో ముదిత! తేటల పల్కుల కీరవాణిరో! 63

ఉ. హంసను వాహనంబుగ గొనం గన నచ్చెరువేమి? ధర్మ మీ
మాంసను చర్చసేసి, భువి మంచిని చెడ్డను దెల్పి, మంగళా
శంసన లీయ జేసితివి! చక్కగ పాలను నీళ్ళు వేరుగా
హంసయ చేయజాలుగద! హాటకగర్భుని రాణి! వాణిరో! 64



మ. కమలం బాకరమందు దాల్చి, అది పంకంబందు జన్మించియుః
అమలంబౌ గుణ సంపదః వరలి సర్వారాధ్య మౌనంచు, నీ
విమలంబౌ యుపదేశ మిచ్చెదవు శ్రీవీణాసుపాణీ! భవం
బు మహిః కేవలకర్మకారణమె సూ! పూర్ణేందు బింబాననా! 65

కం. పర్వము, గ్రహణము, నమవస,
సర్వము, తారలు, గ్రహములు, శార్వరి, దినముల్,
ఉర్వియు, భూతము లాశలు
పూర్వము ప్రస్తుతము భావి భోగిని! నీవే! 66

శా. ఉత్తుంగాద్రుల శృంగముల్ గన, నటః-ఉవ్వెత్తు నీహారముః,
ఎత్తౌ భూరుహముల్, నదీనదములుః, ఇంపైన కాసారముల్,
నెత్తావుల్ విరజిమ్ము పుష్పలతలుః, నీరాకరాసారముల్,
మత్తేభాదిమృగాలు, పక్షిగములుః, మాతా! భవద్రూపమే! 67

ఉ. మెత్తని హంతూలికల మెట్టిన నీ యొడిలోని కచ్ఛపిః
నొత్తుచు నొప్పుగా జగతి నోంకృతి నింపుచు విశ్వమోహనా
యత్తము సేతువో ముదిత! అయ్యది మధ్యమ వైఖరీ స్వరా
లెత్తుచు లోకజీవనము నేపు పరస్పర సఖ్యబంధమై. 68

ఉ. మెత్తని హంసతూలికల మెట్టిన నీ యొడిలోని కచ్ఛపిః
చిత్తమునందు జూడ నది జీవశరీరము, దాని తంత్రులుః



హత్తిన పింగళా ఇడయు, అట్లు సుషుమ్నయు వెన్ను మెట్లగుఁ
నొత్తుచు నీవు మీటగనె నొప్పుగ వాక్కులు నాల్గు పలు దా! 69

## సర్వాంతర్యామిత్వము

ఉ. తాంత్రికశాస్త్ర జాలమును తాత్త్వికదృష్టిని దర్శి చూడగా
యంత్రములందు నొక్కతెవె- అద్భుతశక్తిని నీవబీజమై,
మంత్రము, ప్రాణమై, మిళితమై, వినియోగము, కీలకానివై,
తంత్రవిహారిణీ! పరగ తంత్రము యంత్రము మంత్రమైతివో! 70

మ. మదిలో నూహలు పెచ్చురేగి, అవి నీ మహాత్మ్యముం గూర్చి, ఏ
పదరూపాలనొ దాల్చి, వాక్యమగుచుఁ, పాదంబు పద్యంబునై
పిదపఁ సుందర కావ్యమౌ ననగ ఓ వీణాసుపాణీ! కనఁ
నిది ఆశ్చర్యము గాదు- నేను నిను వర్ణింపఁ స్తవంబయ్యెగా! 71

చం. మనమున రేగు భావనకు మాటలరూపము నిచ్చి, మాటలన్
బనుపున కర్మలందునిచి, బాసట మానస వాక్క్రియాత్రయం
బనువుగ నేక సూత్రమున నన్వయముంచు నెవం డతండె సూ
ముని యని విజ్ఞలోక మను- మూడును నీదగురూపు భారతీ! 72

శా. అద్వైతంబును శంకరుండు తెలిపెఁ సాయుజ్యమంచుఁ, విశి
ష్టాద్వైతంబును రామసోదరుడనెఁ సారూప్య వాదంబునఁ,



అద్వైతంబును మధ్వదేశికుడనే్ సామీప్య మావీడి, ఓ
అద్వైతామృత వర్షిణీ! నిజముగా నా మూఁడు నీవే సుమా! 73

ఉ. దంపతులన్న నేమి- గృహధర్మము నిల్పగ భార్యభర్తయుర్,
నింపుగ గూడుటే, ప్రకృతి యేపుగ శక్తను జేరుటే కదా!
చంపకనాసరో! ప్రకృతి శక్తియు బ్రహ్మము శక్తయన్నచో
సంపదలీను శక్తియును శక్తయు నీదగు రూపు భారతీ! 74

శా. కాంతారంబున కేగి నొక్కగుహ నేకాంతంబు నందుండి, యే
చింతాధ్యాసలు లేక ధ్యానమతులై చెల్వొందు షట్చక్రముల్
స్వాంతబందున నొక్కదాని నొకటర్ సంధించి వేధింపగా
అంతా నీవయి విశ్వరూప మొకటే యన్పించు వాగ్దేవిరో! 75

మ. ఎపుడో బాల్యము నందు నక్షరముల న్నేర్పించి దిద్దింపగా
ఇపుడా వర్ణములందు నీ విభుత నాకెంతో విచిత్రంబుగా
విపులంబై కనుపింపగా దొడగె నీ విశ్వాత్మ తత్త్వంబుతో
కపిలా! వాక్కులు నాల్గు పెంపొదవ వాగ్భావాస్య "వాగ్దేవి"రో! 76

ఉ. కమ్మని పల్కులందు, శుభగత్వము గల్గిన మాటలందు వా
లమ్ముగ జక్కనౌ పదములందును, మెత్తని బాసలందునర్,
తెమ్మెర వాక్కులందు, పువుదేనెల శబ్దములందు, జీవనీ
రమ్మల వాక్యమందు, నుడులందు వెలార్తువు నీవు భారతీ! 77

✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣

ఉ. రేకులు విచ్చుపూలు, నునురెమ్మలు, వెన్నెల హాయిరేలు, మా
రాకులు సాగు తీగలును, హాయిగ వీచెదు పిల్ల తెమ్మెరల్,
సైకత రాశులుఁ, భ్రమరసంతతి, పారెడు వాగువంకలుఁ
ఆకసమందు తారకలు, నందము నీదని పల్కు శారదా! 78

శా. కామాక్షీ, వలజా, వరాళి, సురటీ, గాంధారి, జంఝూటికా,
శ్యామాంగీ, శివరంజనీ, బిలహరీ, సావేరి, హంసధ్వనీ,
సామా, మోహన, శంకరాభరణ, శ్రీ, సారంగి, భాగ్యేశ్వరీ,
కామప్రేరిణి, మధ్యమాది, శహనా, కల్యాణి, రాగప్రియా! 79

చం. మనసున నీవు గల్గగ సుమాలయసుందరి! మాకికఁ భయం
బను పదమేల నమ్మ! మది సాదర మొప్పగ నీ పదద్వయిఁ
జొనిపిన నిశ్చలంబగుచు సుస్థిరమై మనకుండునా-తగఁ
దినకరదీప్తి దేహ! భువి దీనజనావళి బ్రోచు భారతీ! 80

శా. నీ రూపంబును నిచ్చ మానసములో నిశ్చింత నూహించుచో
నీరోద్భూత దళాయతాక్షి! వరమౌ నీనామమంత్రం బొగిఁ
వేరే ధ్యాసలు లేక నిత్య మనుచో విశ్వాస పూర్ణంబుగా
గీరాశీశ్వరి! నీవ మోతు వట మాక్షేమంబు యోగంబులఁ! 81

శా. ఏవో భావపరంపరల్ మనసులో ఎన్నెన్నో రూపాలతో
ఏవేవో విషయాల గూర్చి వెలగఁ-ఏర్పాటు చేయంగ-రా

జీవాక్షీ! పటిమన్ బ్రయత్నపడి-నీ చిద్రూపమౌ శక్తిరూ
పావిర్భావ మటంచు నాకు దెలిసెన్ "వాగ్దేవి" ఓ భారతీ! 82

శా. నీవే లోకము నంత నిండి పరువన్ నీశక్తి నైకాత్మయై
జీవాజీవ సమస్తవస్తు తతిలో చిద్రూపమై యుండగా
జీవేశీ! జగదీశ్వరీ! యని విదుల్ సేవించి కీర్తింత్రు, రా
జీవాక్షీ! కన మా తరంబె మహిమల్ చిత్రంబు "వాగ్దేవి" రో! 83

శా. "వాగ్దేవి" పదపంకజాత యుగమున్ పట్టంబులో నిల్పి, సు
స్రగ్దర్భాదుల బూజసల్పి, యొకటన్ శ్రద్ధావధానంబుతో
వాగ్దంభంబును వీడి, ముద్దులొలుకన్ వాగ్ధాటి వాక్రుచ్చరే!
దిగ్దంతుల్ కవిశేఖరుల్ సులువుగా దివ్యప్రబంధంబులన్! 84

మ. మహతీ వీణియ చేతబూని మధురమ్మౌ నాద మొల్కించుచున్
ఇహవాంఛల్ మది దూరమౌ నటుల నేవేవో త్రయీ మంత్రముల్
బహు వారంబులు మీటు నారదుడు "శ్రీవాగ్దేవి!" నీ కచ్ఛపిన్
సహసా విన్నపుడెంతొ సిగ్గుపడు నీ సంగీత సౌలభ్యమున్! 85

తే.గీ. నీదు గుడికడ కేతెంచి పాదయుగళి
మ్రొక్కి నీదివ్యతేజంబు చొక్క జూసి,
నీదు మంత్రంబు మదిలోన నిత్య మనగ
మదిని మోదంబు "వాగ్దేవి!" ఒదవు మాకు! 86

✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣✣

ఆ.వె. నీదు తెలుపు చీర నెమ్మది జూడగా
స్వచ్ఛమైన బ్రదుకు పావన మని,
శాంతి దాంతి కీర్తి సంపాద్యము లనియు,
తెలుపుచుండు మాకు పలుకు తల్లి! 87

తే. గీ. ప్రకృతి యంత తేజోమయం బగును జూడ,
తేజ మది సత్వభరితంబు తెలిసికొనగ
సత్వ మన స్వచ్ఛతయె గాన, స్వచ్ఛమనగ
తెలుపని తెలుపు భారతి తెలుపు మేను! 88

తే. గీ. నీదు తత్త్వంబు నెఱుగంగ నెంతనేను!
ఋషులు మునులును కవులును కృషి యొనర్చి-
వేదవేదాంత శాస్త్రాలు వెదికి చూసి
నిర్ణయించిరి "వాగ్దేవి" నిన్ను కొంత! 89

సీ. శ్రీలంకలో శాంకరీ దేవిగా బుట్టె
కామాక్షిదేవిగా కంచియందు,
ప్రద్యుమ్న పురమందు వరశృంగళాదేవి
చాముండి వెలసె క్రౌంచపురిలోన,
శుభ్ర నలంపురి జోగుళాంబగ బుట్టె
శ్రీశైల భ్రమరాంబ చిగురుబోణి



కొల్హాపురమునందు కోటి మహాలక్ష్మి
ఇంపైన మాహూర ఏకవీర!

తే. గీ. ఉజ్జయిని కాళి, పీఠికను పురుహూత,
ఓఢ్య గిరిజాంబ, మాణిక్య యొప్పుదక్ష,
హరిని కామ, మాధవి శ్రీ ప్రయాగయందు,
జ్వాల వైష్ణవి, మంగళ వరలు గయను,
కాశి అన్నద, శారద కాశ్మీరమున. 90

కం. అష్టాదశ పీఠములన్
అష్టాదశ శక్తులౌచు నాయా సరణిన్
మృష్టాన్నప్రీతవగుచు
స్పష్టంబుగ వెలసితి వట భారతభూమిన్! 91

తే. గీ. శైలసుత, బ్రహ్మచారిణి, ఛన్నఘంట,
మరియు కూష్మాండ, స్కంధునిమాత, కాత్య,
కాలరాత్రి, భైరవిరతి, కనగ-దేవి,
సర్వసిద్ధియు, నవదుర్గ-శక్తి యనగ! 92

శా. కాళీరూపము, వాణిరూపు, పరగన్ కళ్యాణి! శ్రీలక్ష్మియున్
నీ లీలాసరసాకరాకృతి మతిన్ నే నెట్లు గుర్తించెదన్



నాలో నిత్యము వెల్గు దీపమును నీ నామాజ్యముం బోసి, ఓ
బాలా! జ్ఞానసరస్వతీ! సమముగా వాగ్జ్యోతి దీపింపుమా! 93

శా. ఎన్నో రూపములందు నిల్చి, భువిపై నెన్నెన్నొ ప్రాంతాలలో
ఎన్నో నామములం జెలంగి జనులన్ ఎన్నో వరాలిచ్చుచున్
ఎన్నో తీరుల బ్రోచుచుండు వటగా ఈ శక్తి దీపింపగా!
నెన్నైనా మరి నామనంబు నిలిచెన్ ఈ దివ్య "వాగ్దేవి"లో! 94

## పురాణ ప్రమాణం

ఉ. రాముడు ఋష్యమూకగిరి రమ్యత శారద పూజ చేసి, ఆ
రామను కన్గొనన్ ప్రబలలగ్నము కూరిచి, వానరేంద్రులన్
ప్రేముడి తోడ బంపగను శ్రీహనుమంతుడు లంకలో గనెన్
సేమముతో నశోకవని సీతను దా విజయోత్సవంబునన్! 95

ఉ. కౌరవసేన గోవులను గైకొని పోవ బృహన్నలుండు నీ
కైరవ పాదముల్ విజయకాంక్షను శారద పూజచేసి, తా
దారుణ మోహనాస్త్రమున ధారుణి పై బడ నేసి శత్రులన్
కూరిమి గోవులన్ విరటు గోష్ఠము జేర్చెను నుత్సవంబునన్! 96

తే. గీ. పాండవు లోనర్ప నాజ్ఞాతవాస మేగి
విరటు రాజ్యమునకు శమీవృక్షము పయి-



నాయుధాలుంచి, శ్రీస్తవ మాచరింప-
ధర్మరాజు-సఫల మయ్యె ధర్మదీక్ష! 97

తే. గీ. రాము డాశ్వయుజ దశమీ రమ్యతిథిని
తల్లి బూజించి సీతవార్త వినగలిగె!
విజయు డారీతి గోగ్రహణ జయముగనె,
నటుల విజయదశమి యను నాఖ్యవరలె! 98

శా. దత్తాత్రేయ నృసింహభారతి వెసన్ దర్శించి తీర్థంబులన్
చిత్తంబందున గోరి వాసరపురిన్ సేవించి, శ్రీ గౌతమిన్
ఉత్తుంగోర్మ్ముల వేగ మున్గి, జననీ! ఓంకార యోగంబుతో
త్వత్తారుణ్య మనోహరాకృతి గనన్ పాదాలు సాక్ష్యంబిటన్! 99

## వేడుకోలు

మ. గత మందెన్ని దినంబులో గడిచె, చొక్కాగూడ లేకుండ, ప్రా
త తువా లొక్కటి పైన వేసికొని, హస్తంబందు గ్రంథంబుతో,
అతిగా మాసిన పంచెతో తునకలౌ యజ్ఞోపవీతంబుతో
బ్రతుకుం గూర్చిన బాధతో దిరుగ - భావాతీత రాజేశ్వరీ!100

శా. రాజ్యాలేలెడు వాంఛతోడ నిను నారాధింపనో వాక్పతీ!
పూజ్యంబైన ధనంబుగాని మరి యే భోగాలు భాగ్యాలకై
ఆజ్యప్రోక్షిత పంచభక్ష్య పరమాన్నా లింక నే గోర, ఓ
రాజ్యాధీశ్వరి! భక్తి గోరెద భవద్రాజీవ పాదంబులన్!101

✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣ ✣

ఉ. వాణిని నాలుకా! పలుకు, స్వాంతమ! భాషను చింతసేయుమా,
పాణియుగంబ! అర్చిలుమ బ్రాహ్మిని, శ్రోత్రములార! శారదా
గానము నాలకింపుడిక, కన్నులజంట! ముఖంబు చూడుమా,
పూనిక పొమ్ము వాసరకు భో చరణ ద్వయి! భారతిం గనఁ,
ఘ్రాణమ! మూర్కొనం గడగు గంధము, మూర్ధమ! మ్రొక్కుమా తగఁ! 102

ఉ. ఆశలు నీరుగాగ, మదనాతురవాంఛలు వీచికాతతుల్,
రాశులు రాశులౌ జలచరంబులు సోదర బంధు వర్గముఁ,
పాశుని రూపమౌ సుడులు భార్యయు నైన భవాబ్ధి నే నెటుల్
ఓశరదా! తరింతు భవదోంకృతి నావ సహాయ మీనిచో! 103

తే. గీ. వాణి! భవదీయ శ్రీపాద పద్మయుగళి
నేడె మానస హంసము నిల్చు గాక!
అంతదశలోన నీనామ మనగ, నాకు
గళము పెకలునో పెకలదో కళల తల్లి! 104

తే. గీ. నాదు కర్మ ననుసరించి నాదు వసతి
స్వర్గమొ, నరకమొ, భువియొ, శారదాంబ!
యగును గాక! నాకెన్నడు బుగులు లేదు!
మరణ మందైన నాకిమ్ము చరణ సేవ! 105



కం. సంసారంబను జలధిని
హంసారూఢ! గడవంగ నందఱి వశమా!
శంసార్హంబగు భక్తి న
హింసా గుణనావ జేర్చి–ఇక మాకిడుమా! 106

## విన్నపము

చ. చదువులు చూతుమా మదిని సంతస మింతయు లేదు, పిల్లవా
ళ్ళెదిగిన పిమ్మటన్ బడికి నెన్నని వేలకు వేలు ఫీజులన్
ముదమున పేదవార లొగి ముట్టగ జేతురు కేజిక్లాసులన్?
పదపడి పెద్దవిద్య లెటు ప్రాప్తిలు వారికి? చెప్పు శారదా! 107

ఉ. ఆకలి మంటతో మనిషి అన్నము గోరిన, కాగితాలపై
కాకుల లెక్కవేసి అధికారులు చల్లగ చర్చసేయ–ఆ
ఆకలి తీరునా? ఫలము లబ్బని కాగితమందు గీతలున్
కాకమ లెక్కలున్ – ఎవరి కన్నుల నీళులు తుడ్చు శారదా! 108

ఉ. వానలు సోనలై యులుగు వంకలు వాగులు వఱ్ఱలై భువిన్
గానలు గుట్టలన్ గడచి కాలువలై సెలయేళ్ళులై అలా
ఆనక పెద్దపెద్ద నదులై జలధింబడి పోవ నాపగల్
చేనుకు బారజేసి పెను సేద్యము సేయగ రాద శారదా! 109

ఉ. వాదము లెన్నియో గలవు, వాని వదంతులు గూడ నెన్నియో!
బోదెలు గట్టి సాగెను పెనుభూతము లట్టులు పెద్దచెట్టులై



పేదల జీవితాన కనిపెంచునె పూవును కాయనైన? ఈ
వాదులతో ప్రయోజనము వాటిలునా యిసుమంత శారదా! 110

చం. చినుకులు రాలి నేలపయి చిన్నగ చిందుచు తుళ్ళి ప్రక్షల
బునుకుచు నెండు బీటలును, బుల్గల, చెట్లను జంతుజాలమున్,
మనసులు మోడులై పొగులు మాదృశ సున్నిత మానవాళిలో
మనియెడు హాయిని నింపును సుమాలయసుందరి! నీదుశక్తిచే!111

చ. ప్రమిదను చేతగొంచు, నొకవత్తిని బాగుగవేసి, తైలమున్
సమముగ బోసి, అంటిలగ చక్కగ వెల్గుచు కాంతి జిమ్మదా!
హిమసమ శుభ్రదేహ! భవదీప్సిత సేవన భక్తి తైలమున్
కొమరుగ బుద్ధిలో నిడితి! కొంచెము చిత్తము నంటబెట్టుమా!112

కం. వల్లీ త్రయమున వరుణుడు
వల్లింపించగ భృగుముని పాఠము నేర్పన్
యుల్లంబందున నెఱుకను
తల్లీ! నీరూపము గని తబ్బిబ్బయ్యెన్! 113

కం. సూర్యుడు పొడవక మునుపే
ఆర్యులు దివిగంగ పూలు నంజలి గొనుచున్
తూర్యారావముల నడుమ
ఆర్యా! నీ చరణసేవ కరుదెంచి రదో! 114



కం. దీక్షలు బూనిన భక్తులు
పక్షతి నియమము వహించి పారాయణముఁ
అక్షయ మొనరిచి వాసర
భిక్షాం దేహీ యన సఫల భిక్షలు దొరకుఁ 115

కం. నిత్యము నైమిత్తికమును
నత్యంతం బైన శ్రద్ధ నఖిలపు బనులఁ
వ్యత్యాసము లేక గొలువ
సత్యముగా ఫలము నీవు సత్వర మిడుదే! 116

సీ. వేదమా-వల్లించలేదు - పదక్రమ
స్వాధ్యాయ మేరీతి వచ్చు నాకు!
ఉపనిషత్తా-నేర్చుకో లేదు - వ్యాఖ్యాన
వివరణ లేరీతి నవగతమగు!
రామాయణమును, పురాణేతిహాసము
లభ్యసింపగలేదె-అబ్బుటెట్లు!
శాస్త్రాలు కావ్యాలు చదువనే లేదు-నా
కేవిధి స్పష్టమై ఇంత తెలియు!

తే. గీ. పొట్టకూటికి పరుగెత్త ప్రొద్దుగ్రుంకు
సంధ్యవార్చుట గాయత్రిజపము సేత

✤✤✤✤✤✤✤✤✤✤✤✤✤✤✤✤✤✤✤✤✤✤✤✤✤

తప్పు-నాకేమి చేతగాదమ్మ! నీదు
స్తవము వ్రాయుట "వాగ్దేవి" చలువ గాదె! 117

సీ. ఉత్పల మాలల నుంచితిఁ గళమందు
ఉత్పలనేత్రకు తత్పరమతి!
చంపకమాలలు చక్కగా వేసితి
చంపకనాసకు చాలినన్ని!
శార్దూలవిక్రీడ దుర్దాంతరీతిలో
శార్దూల వాహకు సర్దినాడ!
మత్తేభఘీంకృతుల్ హత్తించినాడను
మత్తేభయానకు చిత్త మలర!

తే. గీ. అందమౌ కందగీతులు నాటవెలది
సీసములను గూర్చితి నమ్మ చెన్నుమీర
దయను-సాహిత్యపు విశారద! గొనుమమ్మ
గీసితిని బొమ్మ శ్రీదాస! గీరసజ్ఞ! 118

కం. నీ నామ మంత్ర మననము
నే నీమముతో సలుపగ, నీవే పలుకఁ
నే నాలకించి వాణీ!
నే నీ స్తవమును రచించి నీకే యిడితిఁ! 119

| | | |
|---|---|---|
| పేరు | : | మాధవపెద్ది చిన వేంకన్న M.A., B.O.L. |
| తండ్రి | : | శ్రీ కనకరత్నం |
| తల్లి | : | శ్రీమతి సత్యవతమ్మ |
| జననం | : | 7-6-1941 |



| | | |
|---|---|---|
| విద్యాభ్యాసం | : | వేదాంత వర్ధినీ సంస్కృత కళాశాల, సీతారాంబాగ్ హైదరాబాద్ |
| విద్యార్హత | : | B.O.L. (సాహిత్య)<br>M.A. సంస్కృత ఉ.వి. |
| వృత్తి | : | సంస్కృతోపన్యాసకులు, ప్రగతి మహా విద్యాలయం, కోఠి, హైదరాబాద్<br>శ్రీ వేంకటేశ్వర వేదాంతవర్ధినీ సంస్కృత కళాశాల, బేగంపేట, హైదరాబాద్ |
| రచనలు | : | శ్రీ నీడిగొండ నృహరి సుప్రభాతం (సం)<br>శ్రీ వాసర సరస్వతీ సుప్రభాతం (సం)<br>శ్రీ పెనకయ్య మేలుకొలుపు (తెలుగు)<br>శ్రీ కీసర రామలింగేశ్వర సుప్రభాతం (సం)<br>క్వణత్కాంచి (తెలుగు) |
| ప్రవృత్తి | : | జ్యోతిషం, ప్రశ్న, వాస్తు, యంత్రప్రతిష్ఠ |